# పీ ఠి

శ్రీ రవీంద్రులు ప్రాకృత సంస్కృత సారస్వతముల నుండియు ప్రాచీనమగు గాథలనుండియు, చరిత్రమునుండియు వస్తువును స్వీకరించి కొంత వస్తువుమీద తమ యభిప్రాయమును ముద్రించి 'కథా' అను గ్రంథమును వంగభాషలో రచించిరి. దాని కిది తెలుగు.

ఈ వస్తువునే గ్రహించి మఱికొందఱు కవులు మఱికొన్ని కథలు రచించిరి. వారిలో అనటోల్ ఫ్రాన్స్ అను వా రొకరు. వీరు బోధిసత్త్వావదాన మందలి 'అభిసారము' అను కథలోని వస్తువును గ్రహించి పరాసుభాషలో కథారచన చేసి దాని కొక నూతన ముఖ మొసగిరి. ఎవరి యభిరుచి వారిది. శ్రీ అనటోల్ ఫ్రాన్స్ రచన తెలియకముందు అతనివలె స్వతంత్ర రచన చేయవలయు నని నాకు దోచలేదు. అంతకుముందే నేను రవీంద్రుని దలిగించుకొని కూర్చుంటిని.

సుమారు పదునేనేండ్ల క్రింద నాకడ జమవు బాలురకు కథలు చెప్పుచు వచ్చితిని. ప్రబలమగు వారి కోరికయే నా యీ యనువాదము నకు కారణము.

శ్రీ రవీంద్రుని శక్తి యందఱకును పరిచితము; నాయశక్తి యందఱకును సుపరిచితము ఊఁ. ఇక పుట త్రిప్పుడు.

*
* *

పీఠిక

అ. ఆది లేనివాఁడ! యాత్మ! యతీతుఁడా!
కథలు సెప్పు నాకుఁ గథలు సెప్పు!
కడలు లేని రేలు కను చేల కూర్చుందు?
కథలు సెప్పు, నాకుఁ గథలు సెప్పు.

చ. యుగము లవెల్ల నాత్మకథ
లొయ్యనఁదెచ్చి భవత్ సముద్రమం
దెగదిగఁ గుమ్మరించు, మఱి
యెన్నియొ జీవనధార లుబ్బి నీ
యగణితమా జలంబుల ల
యంబగుఁ, బిమ్మట వాని కించుకే
నగపడఁబోవ దాకలక
లా రవదోహలముం బ్రవాహమున్.

అ. అలలు లేని యో భయంకరమానసమా!
కొసకు వాని నెందుఁ గొంచుఁబోదు
వో యతీత! నీవు నా యెదలోపలఁ
గథలుఁ సెప్పు! మంచి కథలు సెప్పు.

*
* *

ఓ. రహశ్చారి ! యో స్తబ్ధ! యో యతీత!
కథలు సెప్పుమ నాకును గథలు సెప్పు !
నీ వచేతనుఁడవు కావు నిజము నిజము
కాన నిప్పుడు నాకును గథలు సెప్పు !

గీ. నాదు నాయువుపట్టుల నట్టనడుమ
నీదు సంచార మెంతయుఁగా వినఁగఁగంటి
ఎన్నియో నాళ్ళనుండియు నున్న కథల
సంచయము నాదు నుసుఱుల నుంచి పొమ్ము.

ఉ. ఓయి యతీత! నీవు భువ
నోదరమందున దాఁగి చేయు దా
యాయిపనుల్, కడున్ ముఖర
మైన దినంబుల చావలంబులో
స్థేయుఁడ వౌదు గాన నిఁకఁ
జెప్పుమ నా హృదయాంతరాళస
త్త్వాయతనంబున న్నిలిచి
యా కథ లీ కథలుఁగా రహాగతిఁగా.

*
* *

పీఠిక

ఆ. కథలు చెప్పు నాకుఁ గథలను జెప్పుమా
మఱవ వెన్నఁడెట్టి మఱుఁగు కథలు
కథల నన్ని నీవు కడు సంగ్రహింతువు
కథలు సెప్పు నాకుఁ గథలు సెప్పు !

అల్ల జీవసంపు టాకాకునందున
నెపుడు కానరాని లిపులతోడ
మజ్జలోన మెదిపి మాదు ముత్తాతల
యుబుసు లెల్ల వ్రాయుచుందు వీవు.

ఎవరు తమదు నుబుసు లేమరినను, వారి
యుబుసు లీవు మఱవ వొక్కయింత
మఱవు మూాగతనము కలచిన కథలను
స్థాణు ! చిత్రముగను దాల్తు వీవు

ఓ మహామునీంద్ర ! యోయి యతీతుఁడా !
వాని యన్నిఁటికిని భాష యిమ్ము
ఓయి తాత ! చేత ముట్టాఁత లూఁగఁగాఁ
గథలు చెప్పు నాకుఁ గథలు చెప్పు !



# శ్రేష్ఠ భిక్ష

( అవదాన శతకమునుండి )

'బుద్ధుకొఱకు బిచ్చమును గోరి వచ్చితిఁ
        పౌరులార! లేచినారో లేదో'
అంచు నెలుఁగు సేసె నంబుదధ్వనిఁ బై
        పెచ్చుగా ననాథపిండదుండు.*

ఆవాసంబులలోఁ గుహాధ్వనులు సేయంజొచ్చెఁ బుంస్కోకిలల్
గైవారంబులు వందిమాగధులు వక్కాణింపలే దింక నా
శ్రావస్తీ నగరాంతరాళ ధవళప్రాసాద శృంగంబులం
దావిర్భూతము లౌచునుండె నపుడే యాదిత్యశోణప్రభల్.

భిక్షుకుండు వల్కె బిగ్గరగా నిట్లు:
        నిద్రఁజెందు పురమ! నెమ్మి లెమ్ము!
నాకు బిచ్చ మిడుము, నాఁగను విసినట్టి
        పురమువారి యొడలు పులకరించె. 3

---

* ఇతడు బుద్ధదేవుని ప్రధాన శిష్యులలో నొకడు

శ్రేష్ఠభిక్ష

'వినుఁడు మబ్బు లుద్దవిడి వానకాఱునఁ
దాము చేటు నొంది దాన మిచ్చు
నెల్ల ధర్మములకు నీవియే యెక్కువ'
యంచు నల్ల భిక్షు వఱచి చెప్పె

అల్లకైలాస శిఖరంబు మెల్ల వీడి
వాడ వాడలఁ దిరుగాడ వచ్చియున్న
యాది భిక్షువు గానమ ట్లతని వాణి
మించె నాగాల భోగాల మేడలందు.

అవనిపాలకుఁడు దా నఱమోడ్పుగనుల రా
జ్యము గీజ్యమున్ వృథా యంచుఁ దలఁచె
కోటికిఁ బడగెత్తు కోమటిపెద్ద ద్ర
వ్య మిమ్మ దంతయు వమ్మటంచు నెంచె
గేస్తు లెల్ల రెడందఁ గీలుకొల్పిరి చాలఁ
గూడఁబెట్టుట మాయగోడ యంచు
బాలికా లోకంబు బాష్పంబు వర్షింపఁ
గాఁ గడంగెను సుంత కతము లేక
సుఖము లవి గతరాత్రివంచును దలంచి
కామినీమాల శుష్కమై కానిపించె
ఇంట నింట గవాక్షముల్ జంటబాసె
నిదురమబ్బు దొఱంగి కన్దోగలు విచ్చె.

మేలుకనుండు బిచ్చమును మీర లొసంగుఁ డటంచు నల్దెసల్
చాలఁ బ్రతిధ్వనింప మరలన్ మరలన్ గడు వేడి సుప్త సౌ
ధాళులపై నసుప్తమగు నక్షుల నెత్తి యనాథపిండదుం
డోలి గమించె నొక్కఁడును నొక్కఁడు లేని విశాల వీథిలోన్.

కొందఱు కంఠహారములు కొందఱు పెం దలమానికంబులున్
గొందఱు నూత్నరత్నములు కొందఱు మేల్ జలతారుచీరలున్
గొందఱు వెండినాణెములు కొందఱు బంగరుటుంగరంబులున్
వందలు వేలు గా విసరి వైచిరి భిక్షుకు కాలిముంగలన్.

భిక్షుకుండు వాని వీక్షింపఁగాఁబోక
దవుల దవులయందె తాను నిల్చి
'అయ్యా! నాదు ప్రభున కర్పింపుఁడా భిక్ష'
యంచు మరలఁ బల్కె నట్టు సాఁచి.

సొమ్ములపై వెలగల వ
స్త్రమ్ములపై దుమ్ము గ్రమ్మె రత్నమ్ములపైఁ
గ్రొమ్మెఱుఁ గాడెన్ శ్రమణకుఁ
డు మ్మతి జోలియను గొం చిటుల్ వచియించెన్.

అయ్యా పౌరులార! యవధాటుఁడా! భిక్షు
వులకు రేఁ డతండు బుద్ధదేవుఁ
డతని కిమ్మఁడు మీర లన్నింటికంటెను
నెక్కుడైన దాన మేదియో దాని. ౧౧

## శ్రేష్ఠభిక్షు

అనఁగ రేఁడు మరలె నరిగెఁ గోమటిబిడ్డ
　　యొలమిఁ బ్రభున కీయ నీవి లేక
నగరమెల్ల సిగ్గునం దల వాల్చె భి
　　క్షుకుఁడు దాపు వనము చొఱఁగఁబాఱె.

కూటికిఁ జింపిగుడ్డకును గూడఁ గొఱంబడి భూశయానయౌ
బోటియొకర్తు లేచుచునె మ్రొక్కి బిరానఁ దొలంగఁబాఱి సాం
ద్రాటవియే కడింది తెరయై చనఁగాఁ దనమీఁది పుట్ట మా
బాటకు సూటిగా విసరివైచెను భిక్షుకు కాల్కడం బడన్.

ఆతఁడు చేతు లెత్తి దరహాసముతో జయవెట్టి ధన్యవో
మాతరో నీకు దీవనలు! మా ప్రభుకోరిక తీర్చితంచు నా
ప్రాఁతపటంబునుర్క శిరముపైఁ గొని బుద్ధపదంబులందు సం
ప్రీతిని దానిఁ గాన్కయొనరింపఁగఁబోయెఁ బురంబు వీడుచున్.
౧౮

* * *

# ప్రతినిధి

ప్రాతఃకాలమునందు నొక్కెడ సతారా దుర్గ శృంగంబునం
జేతోమోదముఁ జెందఁ గోరుచు శివాజీ మెల్లఁ గూర్చుండి యు
య్యై తావుల్ గనుచుండె నాసమయమందాచార్యుఁడౌ రామదా
సా త్రోవం జనుచుండె జోలె కరమం దల్లల్ల నల్లాడఁగన్.

అప్పు డా శివాజి యనుకొనె నీరీతి
　　నేమి యీతఁ డన్నహీను భాతిఁ
దిరిపెమునకుఁ దాను దిరుగుచున్నాఁడు
　　గడప యొక్కఁడేని విడువఁబోక.

ఎవ్వానియింట లేమికిని నించుకయేనియుఁ జోటు పుట్టదో
యెవ్వని యాజ్ఞ కడ్డమొక యించుకయేనియు లేదొ యిట్టి నే
నెవ్వని కెప్పు డవ్వాలను నివ్వాల బంటనో యట్టి యొజ్జకున్
వవ్వారె నేఁటివట్టువకు వాసన వాయు దిఁకేమి చెప్పుదున్.

చిల్లిగల కడవలోపల
నీళ్ళ న్నిండారఁబోసి, నిజతృష్ణను దాఁ
జెల్లరె తీర్చుకొనంగా
నుల్లంబందులను దలఁచుచుండె నితఁడహో.

అయినం జూచెదఁగా కీ
యయవారల జోలె యెంత యర్పించినచో
వెయిమాఱుల కొకమాఱుగ
నయి నిండునో యంచు లోన ననుకొంచు వెసన్.

లీలం గాకితముం గలంబుఁ గొని యేలేఖంబు దా వ్రాసెనో
బాలాజీ నిటు రమ్మటంచు వడి నాహ్వానించి—'భిక్షాశ నే
వేళన్ దుర్గము దాపుగా గురువు దా వేంచేయు నావేళయం
దీ లేఖంబును వారిపాదములముం దీ వుంపుమీ' యం చనెన్.

గురు వంతఁ బాడుకొంచున్
జరుగుచుఁ బోచుండె నతని సమ్ముఖమందెం
దఱొ బాటసారు లెన్నియొ
తురగంబులు బండ్లు జవముతోఁ జనుచుండెన్.

'శంకర! మెల్లవారికి నొసంగితి విండ్లను నాకు వంకలున్
డొంకలె యిచ్చి తంబిక కదున్ జగతీభర మన్నపూర్ణ తాఁ
జంకఁగొనెం జరాచరము చల్లగ నున్నది యోబికారి! యం
బొంకమునుండి లాగికొని యల్లన నన్ గయికొంటి బంటుగన్.'

గానం బీగతిగా సమాపనమునుం గావించి మాధ్యందిన
స్నానంబుం బొనరించి దాపులకు నాచార్యుండు వేంచేయఁగా
నానందించుచు, వందనంబును సపర్యం జేసి బాలాజి, తేఁ
డానం బెట్టిన చీటి పాదములముం దర్పించె నల్లల్లనన్. ౯

చూడఁగ నా కాకితమును
వేడుకపడి రామదాసు వెసఁ గైకొనియెన్
తాఁ డందు దనకు రాజ్యము
వీడును నర్పించినటులు విశదంబాయెన్. ౧౦

మఱుదినంబునందు మహిపాలుఁ గనిపల్కె
రామదాసు—'పుత్ర! రాజ్య మెల్ల
నిచ్చినందువల్ల నీకును, గయికొని
నందువల్ల నాకు, నగున దేమి?'

ఇటు లన నా శివాజి యనియెన్ 'గురుసత్తమ! నాదు జీవితం
బిటఁ దమసేవ కిమ్ముగను నిచ్చితి' నా విని పల్కె నాగురుం
డటు లయినం దగిల్చికొనుమా యలజోలెను జంక కింక నీ
విట కట కేఁగి బిచ్చమును నెత్తఁగ నిత్తఱి రమ్ము నావుడున్.

జోలె దాల్చి శివాజి యాపోలియందు
తిరిగె నిల్లిల్లు గురువుతోఁ దిరిపెమునకు
బాలు రది చూచి లోనికిఁ బాఱు తెంచి
తల్లిఁ దండ్రుల చెయి గొని తుర్రిల్లి రాఁగ.

అతులైశ్వర్యరతుండు వానికిని భిక్షాన్నంబునుం గైకొనన్
వ్రత మీసంగతి చూడఁగా జలములన్ రాల్ దేలు చందంబటం
చతివల్ సిగ్గునఁ జేవడంకఁగను దా మర్పించుచున్ బిచ్చముల్
మతిలో నెంచిరి గొప్పవారి కివి ఖేలల్ లీల లంచున్ మదిన్. ౧౧

ప్ర తి ని ధి

కోటను రెండు నెన్మ్రదులు కొట్టిరిపౌరజనావళుల్ పనుల్
పాటలు పూర్తి జేసికొని పండిరి కిన్నరవీణ చల్లగా
మీటుచు రామదాసు వినిమీలితలోచనుఁడై ముదంబుతోఁ
బాటను బాడఁగాఁ దొడఁగె భక్తుల యుల్లము పల్లవింపఁగన్.

ముల్లోకంబుల నేలువాఁడ! తెలియంబోఁజాల నీ లీల నీ
కెల్లన్ లోటనుమాట లేదయిన నీవెవ్వారి సర్వస్వముం
గొల్లల్ గొల్లలుగాఁగఁ గైకొనెదు కోర్కుల్ సందడిం జెందఁగా
నుల్లంబుల్లము చెంతఁ గ్రుమ్మరెద వోహో చోద్యమేమీ ప్రభూ.

ప్రొద్దుగ్రుంకెను నపు డల్ల ప్రొలిచివర
వాఁకఁ గ్రుంకిడి యన్నమ్ము వండి యొజ్జ
కొంత ఁదినియెను శిష్యుండుగూడ మిగులు
దానిలోఁ గొంతగొనెఁ బ్రసాదంబు నంత.

ఏలిక నవ్వుచుం బలికె నిట్లు నృపాలుని గర్వమెల్లయున్
వ్రీలఁగఁజేసి దారిఁజను భిక్షుకుఁ జేసితి వేను లెంకనై
వ్రాలితిఁ జెంత నింకఁ దమ వాంఛిత మెయ్యది? యేదియైననుం
బాలనముం బొనర్తు నని బాసయొసంగితి సిష్ఠ పెల్లునన్.

అనిన రామదాసు జననాథుతోఁ బల్కె
గట్టియొట్టు నీవు పెట్టుకొంటి
నాదుమాట వినుము నా పేర నాకుఁగా
మహీప! రాజ్య మీవు మరలఁ గొనుము. ౧౯

## ప్రతినిధి

ఓ నరపాలమౌళి! విధి యుక్తిగ నిన్నును దానుదాసతా
ధీనుని భిక్షుకప్రతినిధిం బొనరించెను, నాకుఁగా మహీ
జాని విధిన్ గ్రహింపు మిఁక సాగరనాగరరాజ్యభారముం
బూనియు రాజ్యహీనుగతిఁ బొల్పుము; చాలును జాలఁ జెప్పితిన్.

వెండియొకమాట యోతండ్రి వినఁగదోయి
నాదు దీవనతోపాటు నాదుశాటి
చేకొనఁగదోయి రాజపతాకగాఁగ
నిమిడియున్నది రాజార్థమెల్ల దీన.

అనినఁ దలవంచి భూధవుం డార్తి నుదుటఁ
జేరుకొన నేటియొడ్డునఁ గూరుచుండె
గొల్లపిల్లల పిల్లనఁగ్రోవు లాఁగె
నావు లిండ్లకుఁ జేరఁ బ్రొద్దస్తమించె.

అపుడు రామదాసనన్య మనస్కుఁడై
ప్రతిభతోడఁ బద్యరచన జేసి
శ్రుతిని మేళవించి శ్రోత్రపేయంబుగాఁ
గంఠ మెత్తి పాడఁగాఁ దొడంగె.

ఒడయనితో సంసారపు
నడుమను బంధించినావు నన్నును నీవె
వ్వాఁడవయ్యా నాకుఁ గానం
బడకుండఁగఁ జక్కఁ దాఁగువాఁడవు బళిరా!

ఱేఁడా నే భవదీయపాదుకల భూరిశ్రద్ధతోఁ దెచ్చి కొ
న్నాఁడ న్నీపదవీర దేశమున నున్నాఁడం బ్రభూ! సంధ్య చే
కూడె న్నే నిఁక నెంతకాల మిటులం గూర్చుండుదు? న్నేను నీ
వాఁడ న్నీ విఁకఁ బర్వులెత్తుకొనిరావా నీదు రాజ్యానికిన్. ౨౫

# బ్రాహ్మణుఁడు

(ఛాందోగ్య– ౪ ప్రపాఠక– ౪ అధ్యాయ)

అల్ల సరస్వతి యొడ్డునఁ
బెల్లుగఁ బెనవైచికొనిన పేరడవులలో
నల్లుకొను నల్లచాయల
వెల్లువలో నస్తమించె వేవెలుఁగు వెసన్.

కడుపారఁగా మేసి కన్నుల నఱమూసి
నట్టి ధేనువులఁ బేర్వెట్టి పిలిచి
మరలించుకొనివచ్చి మఱి గోష్ఠమునఁగట్టి
స్నానంబు లొనరించి సంధ్యవార్చి
గురుదేవుఁడగు గౌతమఋషికి ముమ్మ్రొక్కు
లిమ్ముగాఁగఁ బ్రదక్షిణమ్ము చేసి
ఉటజాంగనమునందు హోమాగ్ని వెలుఁగులోఁ
గూర్చుండె ఋషిపుత్రకుల కులంబు
శూన్యము ననంతమగు మింటఁ జొచ్చి శాంతి
ధ్యానమునయందు మగ్నమైనట్టులుండెఁ
బలు కుతూహల మొప్ప శిష్యుల విధానఁ
దారకలు పంక్తులుగఁ దీఱి కూరుచుండె.

ఆశ్రమంబు చకితమైపోవఁగా గురు
 గౌతముండు శిష్యగణముఁ జూచి
బ్రహ్మవిద్య మీకుఁ బ్రవచింతు నియ్యెడ
 సావధాను లగుఁ డటంచుఁ బల్కె.

***

అట్టితఱిం గరంబునను నర్ఘ్యము గైకొని వచ్చి ముంగిలిన్
మెట్టి ఫలప్రసూనములు మేదినిఁ బెట్టి మునీంద్రుపాదముల్
ముట్టి సుధామృదుస్వరము ముద్దులు గూర్పఁ బికీగళంబుతో
నిట్టులు వల్కె నెల్లరకు నింపుగ బాలుఁ డొకండు భక్తితోన్.

అయ్య బ్రహ్మవిద్యయం దభిలాషినై
 దీక్షఁగొనఁగ నేఁగుదెంచినాఁడ
సత్యసంధ! నేఁ గురుక్షేత్రవాసిని
 సత్యకాముఁ డంద్రు జనులు నన్ను.

అన విని గౌతముండు దరహాసముతోడుత వత్సలత్వముల్
పనుపడఁ బల్కె నిట్టులను: బాలక! మే లగుఁగాత! శాంతి ని
న్నెనయుత! నీదుగోత్ర మది యెయ్యది? కేవల మొక్క బాపఁడే
కనుఁగొన బ్రహ్మవిద్య కధికారి యటందురు పెద్దలందఱున్.

బాలకుఁ డాచిచూచి భగవానుఁడ ! గోత్రవిధం బెఱుంగఁగాఁ
జాల మదంబ నే నడిగి చయ్యన తే పరుదెంతు నంచొగిన్
వ్రాలి మునీంద్రుపాదముల పజ్జ ననుజ్ఞను బొంది లేచి యా
త్మాలయసీమ కాతఁడు ప్రయాణ మొనర్చె జవంబుతోడుతన్.

ఇరు లెనయు నడవిఁ గడఁచుచు
నెఱిఁదీసిన యేఱు దాఁటి నిద్రాముద్రా
భరితమగు నూరి దరిగాఁ
బరఁగిన తనతల్లి యింటి పంచం జొచ్చెన్.

ఇంటిలో నొంటి దివ్వియ యెసఁగుచుండె
ద్వారశాఖలఁ జేతుల నానుకొనిన
తల్లి యల్ల జబాల పుత్రకుని మూరు
కొనుచు మంగళమే ? యని గ్రుచ్చి యెత్తె.

అమ్మరో ! బ్రహ్మవిద్య కడు నధ్యయనం బొనరింప గౌతమున్
నమ్మి చనంగ గౌతముఁడు నాదగు గోత్రము గోరి బాఁపఁడే
చు మ్మధికారి దీని కనుచున్ వచియించెను గానఁ దండ్రి నా
మమ్మును గోత్రముం దెలిపి మన్చుమటంచుఁ గుమారుఁ డాడినన్.

మహిపయిఁ జూపువెట్టి యలమాత మృదుస్వర మొప్పఁ బల్కె నీ
రహిః "నెల జవ్వనంబున భరంబగు లేవడిఁ గుంది సేయుచున్
బహుపరిచర్యఁ గంటి నిను, భర్తృవిహీన జబాలగర్భపున్
గుహఁ బడితో యితండ్రి! యిక నోఁచనుగోత్రము పేరు పేర్కొనన్."

* * *

పరదినంబునఁ దపోవన కుజాగ్రములపై
బాలభానునికాంతి ప్రజ్వరిల్లె
శిష్యులు స్నానముల్ చేసి యార్ద్రములైన
జడలు నున్నగ వీఁపు కడల జాఱ
శుచియైన శోభయు సోయగంబగు రూపు
నుజ్జ్వలంబగు మేను లొప్పుచుండ
మంచుచే నిగనిగమంచుఁ గ్రాలు వెలుంగు
కళికలో సద్భక్తి కలిమి బలిమిఁ
గాఱు కన్నీటిచేతను గడఁగఁబడిన
పున్నెముల ప్రోవులో యన ముద్దుగాఁగఁ
గూరుచుండిరి గౌతమగురువు చుట్టు
నిండఁ బెరిఁగిన ముది మఱ్ఱినీడలందు.

అలి ఝుంకారముతో జల
కల తానముతో విహంగకాకలితోడన్
మిలితమయి సామగానము
విలసిల్లెఁ శిష్యకంఠ వేణువులందుఁ.

*
* *

అపుడు సత్యకాముఁ డరుదెంచి డగ్గఱి
ముని పదద్వయంబు ముందు వ్రాలి
నిలిచియుండునంత నిర్మలప్రేమ నా
శీర్వదించి ముని వచించె నిట్లు ౧౫

నాయనా సుదర్శనా ! నీదు గోత్రంపు
నామధేయ మేమి నాఁగ నతఁడు
వంచు తలను నెత్తి భగవానుఁడా ! గోత్ర
మెఱుఁగఁజాలనయితి నిద్ది యనుచు.

తహతహ నేఁగుచేఁగుచునె తల్లిని గోరితి, నామె వల్కె నీ
రహి: 'నెలజవ్వనంబున భరంబగు లేవడిఁ గుంది, చేయుచున్
బహుపరిచర్యఁ, గంటి నిను, భర్తృవిహీన జబాలగర్భపున్
గుహఁబడితోయితండ్రి! యిఁకనోఁచనుగోత్రముపేరు పేర్కొనన్"

అల్లవార్త విన్నయంత రహస్యాలు
గడలుకొనఁగ శిష్యగణము రేఁగె
పెద్దతేనెపెరకు బెడ్డలు గరవాటు
వెట్ట రేఁగు నీఁగలట్టువోలె.

కొందఱు చీచీ యని రిం
కొందఱు కడుఁ బకలఁబడిరి కొందరు లజ్జం
బొందని యనార్య గర్వము
నిందించిరి యందఱుం గొనిరి విస్మయముల్.

అంత గౌతమముని లేచి యల్ల బాలు
నెత్తుకొని బిగ్గఁగౌఁగిట నిట్టు లనియె
సత్యకుల జాతుఁడవు ద్విజసత్తముఁడవు
అవుర ! యబ్రాహ్మణుఁడవు నీవా తలంప? ౧౯

# మస్తకవిక్రయము

(మహావస్త్వవదానమునుండి)

కోసలాధిపతికిఁ గుతలంబులోపల
సాటి యన్నమాట నీటిమూట
అతఁడు పిన్నవారి నారయఁ దలి దండ్రి
యేమి లేనివారి కిల్లుముల్లె.

అతని కథవించుఁ గాశీ
పతి కోసలు నన్ను మించువానిగ లోకుల్
నుతియించువారలే? యని
మతి నభిమానంబుతోడ మండుచుఁ జచ్చున్.

ఎవ్వనిగద్దె నాదిగువనే యగునో యలవాని దానమే
యెవ్వరికేని యింత యగునే? దయ దబ్బఱ యీవి బొంకహో
యివ్వి మనంబునం గనిన నెంతయుఁగల్ల యిదెల్లఁ గేవలం
బవ్విభుఁ డేననంగ హృదయంబునఁ బెంచిన మచ్చరంబు సూ.

సేనాపతీ! కృపాణముఁ
బూనుము సైన్యంబు నెల్లఁ బూఁచుము బళిరే
తానాయె దానకర్ణుఁడు!
వానికి నాపైని నెంత వాత్సల్యంబో! ౪

* * *

కోసలరాజు యుద్ధమునఁ గోల్పడి రాజ్యము వీడనాడి యా
వాసముఁ బాసి పేరడవి పాలయిపోయెను గాశిరాజు సిం
హాసన మెక్కి సభ్యులను నారసి యెవ్వఁడు లక్ష్మిఁ గాచుకో
వాసిగలాఁడో వాఁడె తగువాఁడల దాతృత కంచు నవ్వెనన్.

అందఱు షేనిమాట విని యక్కట దారుణరావాలు వెంతయుం
జందురుఁ గూడ మ్రింగు సిరి చాల బలీయుని బాహు వొక్కటే
పొందఁగఁ జూచుఁగాని కనఁబోవదు ధర్మవు మోము మే మిటం
దందులఁ దండ్రిఁ గోల్పడితి మంచును ఘోషిలి రొక్కపెట్టునన్.

ఏరు జగద్బంధువు ల
వ్వారికి నెవ్వారు రిపులో వారల వదనం
బారయఁగా రాదంచును
బోరనఁ బదిదెసలుఁ గూడ బోరు కలంగెన్.

వించుఁ గాశిరాజు వెసఁ గోపముం జెంది
యేల నగరమందు నింత చింత ?
ఏను లేనటే ? యిఁ కెవ్వరికోస మీ
యెల్లలోక మకట యేడ్చి చచ్చు ?

ఓడియు నన్నునన్ గెలుచునో టతఁ డక్కట శత్రుశేషముల్
కూడవటంచు శాస్త్రములు ఘోషిలునోయి యమాత్యవర్య! యె
వ్వాఁడల కోసలాధిపునిఁ బట్టి యొసంగునో యట్టివానికిన్
మాడలు మూఁడువేలు బహుమానమటంచును జాటఁబంపుమా!

అనిన రాద్దూత లల్ల రాజ్యంబునందు
వేనవేల్మార్లు డప్పులు వేసి రిటులు
:కోసలాధిపునిం బట్టుకొన్నవాఁడు
మూఁడువేల్మాడలం గొనువాఁ డోహోహో॥

*
*   *

మాసిన చీరతోడఁ గసుమాలపు వేసముతోడఁ గాననా
వాసమునందుఁ గ్రుమ్మరిలువానిని గోసలదేశ నాయకున్
డాసి యొకానొకం డొకదినంబున నోవనవాసి మార్గమా
కోసలపత్తనంబునకుఁ గొంచెము నాకు వచింపవే యనెన్.

విని కోసలజనపతి యో
యనఘా! యది పాడుదేశ మటువోవంగాఁ
బనియేమి పొసఁగినది నీ
కని యడిగిన బాటసారి యనెఁ దా నిటులన్.

కోమటి నేను వర్తకముకోసము వారిధిఁ బోవుచుండ నన్
బాముల ముంచి నాదయిన నావ మునింగినదయ్యొ నేనిటే
మోమున వాడవాడఁ బడి ముష్టిని నెత్తఁగఁబోదుఁ? గోసల
స్వామి మహావదాన్యుఁ డని పల్కఁగ వింటిని నింటనింటనున్.

విని రాకొమరుఁడు చిఱునగ
వొనరఁగఁ గన్నిటి నాఁగి యొక్కింత మనం
బున నాలోచించియుఁ దా
ననియెను నిట్టూర్పు చిట్టు లాతనితోడన్.

శోకంబు క్రమ్ముకొనఁగా
వ్యాకులపడి దవులనుండి వచ్చితి పాంథా!
నీకోరిక నిక్కముగాఁ
జేకూరును, దాని దారి జెప్పెద రమ్మా!

* * *

కాశీరాజు సభాంతరాళమునఁ జక్కం బొల్చె నంతన్ జటా
రాశిం దాల్చినవాఁ డొకం డచటికిన్ రాఁజూచి తేఁడోయి నీ
దేశం బేయది? యేల వచ్చితి వనన్ దీవించి నేఁ గోసలా
ధీశుండన్ ననుఁ బట్ట నిచ్చెడు ధనం బిండల్ల బేహారికిన్.

అనఁగ నాశ్చర్యమైపోయె నందఱకును
అంగజాలెల కన్నుల నశ్రులుబికె
కాశిపతి కొంతసేపు నోర్కదపలేక
యెట్టకేలకు నగుచుఁ దా నిట్టులనియె. ౧౭

చచ్చియు నన్నునున్ గెలువఁజాలిన చాతురి చూపఁగల్గె నీ
సచ్చరితంబు నీయశముఁ జాటఁగఁబంచెద నేఁటియాజిలోఁ
జచ్చితి నేను క్రిమ్మఱ నొసంగితి రాజ్యము దానితో మన
స్సిచ్చితి నన్ను నేలుకొనుమీ యిఁకఁ గోసలదేశనాయకా!

చినుఁగు పాతల వనవాసిఁ జేర్చికొనియెఁ
గాశికారాజు ముత్యాల గద్దె మీఁద
మలిన శిరమునఁ దనచేత మకుట ముంచె
బురజనుల ధన్యవాదముల్ బోరుకలఁగ. ౧౯

# పూ జా రి

(అవదానశతకము)

మాయామానవుఁడైన బుద్ధపదముల్ మన్నించి తద్ధూళి చే
దోయింగైకొనిపోయి తోఁటనిడి యెంతో యత్నముంజేసి యా
యాయాశిల్పులఁగూర్చి ముచ్చటలు మ్రోయన్ శిల్పసారంబిలన్
ఖాయంబై చన బింబిసారుఁడెలమిం గట్టించె స్తూపం బొగిన్.

వ్యాజములేనిభక్తి యలరారఁగఁ జల్వమడుంగు దాల్చుచున్
బూజెలు చెక్కు పాత్రమునఁ బూలు దళంబులుఁ గొంచువచ్చి పే
రోజను మేల్మిప్రమిద్మ్రదల నుంచుచు నుందురు దీపమాల యా
రాజవధూటియున్ మఱియు రాజకుమారియు దానిముంగలన్.

*
* *

అట్టేఁడు బింబిసారుని యనంతరమందు నజాతశత్రుఁడున్
పట్టి నృపాసనంబునకు వచ్చినయంతనె తండ్రిధర్మముల్
పట్టిపలార్చి రక్తనదులం బడఁద్రోసెను బౌద్ధశాస్త్రముల్
కట్టలుగట్టి యజ్ఞశిఖిఁ గాల్చెను గట్టడిసేసె నిట్టులన్:

వేదములును తేండ్లు విప్రులునుం దక్కఁ
  దగరు పూజ కెవరు ధరణిలోన
ఇద్ది శాసనంబి దేమఱఁ బోకుఁడీ !
  అట్టులేని వచ్చు నవలఁ జేటు.

*
* *

ఒక్క శరద్దినాంతమున నొయ్యన స్నానముచేసి పూవులం
దక్కిన దివ్యజాతమును దామరపాకునఁ గట్టి పళ్ళెమ్మదల్
చిక్కని తట్టఁబెట్టుకొని శ్రీమతి నాఁబడు దాసివచ్చి తా
నొక్కెడ నిల్చి రాణిపదయుగ్మముకేసి కరంబు గాంచుచున్.

పూలంగాంచి వడంకి రాణి యనియెం బూజాపురస్కారముల్
చాలుం జాలును స్తూపమందు నెవరే సన్నద్ధులై యున్నచో
శూలారోపణమో వివాసనమొ యంచుం జాటరే తొల్లి నీ
వేలా యీ విషయంబునన్ మఱచినావే శ్రీమతీ నావుడున్.

శ్రీమతి యంత రాద్వ్యథువుచెంతల కేఁగుడు నామె యప్పుడే
హేమపు దర్పణం బెనుట నెత్తుచుఁ బాపటఁ జెందిరంబునన్
బాఱుచు దువ్వుకొంచు నొకవంకను శ్రీమతిఁ జూచెఁ, జూపుతో
బాఱెను చెందిరంబు చనెఁ బాపట వంకరవోయె నెంతయున్.

ఓసి తెల్విమాలు దాసరీ యెంతటి
తెగువచేతఁ బూలు తెచ్చినావె
ఏఁగు మింక నెవ్వ రెక్కడఁ జూతురో
అరుగు మరుగు మంచు నామె యనియె.

శుక్ల యన్న రాజసుత సంజవెలుఁగులో
గూఁటిచివరఁ జక్కఁ గూరుచుండి
గ్రంథపఠన మొంటి గావించుచును దాని
గాంచి నేల పుస్తకంబు వైచి.

ఇపుడు తేనియాన యెవ్వ రెఱుంగరు ?
ఇట్లు చావుమీఁది కేల దూఁక ?
పిచ్చిదాన! చాలు హెచ్చైన చేఁతలు
అంచుఁ జెప్పెఁ గడు రహస్యముగను.

శ్రీమతి యర్ఘ్యపాత్రమును జేకొని యింటికి నింటి కేఁగి యో
భామినులార యీ ప్రభువువారల పూజకు వేళయాయె మీ
రీమెయి నుంటి రేల యని హెచ్చరికించినఁ గొంద అందులన్
శ్రీమతిఁ గాంచుచున్ భయముఁ జెందిరి కొందఱు తిట్టిరేపునన్.

శ్రావస్తీపురధాత సౌధములపై సాయంతనాలోకముల్
చేవల్ నించెను దారు లన్నియుఁ దమోలీనంబులై పోయె నే
త్రోవన్ సందడియుం బ్రచారమును దోడ్తోఁ దగ్గెఁ బ్రాచీనదిగ్
దేవాగారమునందు దివ్వె వెలుఁగొందెన్ మ్రోఁగె ఘంటాధ్వనుల్.

రమణమీఱెను శరద్రజని చీఁకటుల నా
కాశంబుమీఁద నక్షత్రసమితి
మ్రోఁగె సింగపుమోము మోసాలయందు దీ
ర్ఘముగా నభంగ శృంగములగములు
పాడఁగాఁబూనిరి వందిమాగధులు సం
ధ్యాకాలయోగ్యముల్ దండకములు
ఆఱచిచెప్పిరి లెస్స ద్వారపాలకులు పే
రోలగం బది యంతమొందె నంచు
మేడపై నున్న ప్రిహారులు మిట్టి చూచి
యప్పు డొండొండ ననుకొని రల్ల స్తూప
మూలమునయందుఁ బంక్తులై క్రాలుచున్న
వేమి ? యవి దివ్వెలా ? యవియే యటంచు.

* * *

ఆ యుద్యానములోని కంతటఁ దలా ర్లాయత్తులై శ్రీమతీ
డాయంగాఁజని కత్తి దూసి చెడుదానా! యేల యారాత్రికం
బీయంబూనెదు ? చత్తువే యెవతవే యీ వన్న నే శ్రీమతిన్
నాయుద్యోగము బుద్ధదేవునకునున్ దాస్యం బనెం జల్లఁగన్.
నాఁడు రక్తధార యోడెను శిలమీఁద
నాఁటిరేయితోడఁ దోఁటలోన
స్తూపమూలమందుఁ దుది దివ్వె వెలుఁగది
ఆఱిపోయె దారి మాఱిపోయె. ౧౫

# అభిసారము

(బోధిసత్త్వావదాన కల్పలత)

తొల్లి మథురలోని తెల్లని ప్రాకార
తటము ముందు భూమితలమునందు
ఒడలు మఱచి పండె నుపగుప్తుఁ డనియెడు
శ్రమణకుండు లోకసన్నుతుండు.

అల్ల పురి నెల్ల దీపంబు లాఱిపోయె
మూలముట్టుగఁ దలుపులు మూయఁబడియెఁ
గప్పఁబడియెను శ్రావణకాలమేఘ
సముదయంబులచేత నక్షత్రసమితి.

అప్పుడొక యందె రవ్వలు
రప్పలు పొదిగినది మిగుల రవ్వయి రటులన్
గుప్పు చుపగుప్తుగుండెల
చిప్పలకుం దాఁకె నతఁడు చివ్వున లేచెన్.

బంగారుపసిమికి శృంగార మొడఁగూర్చు
  మేన నల్లని చీర మేళవించి
చందురమామపై జలదంబు శకలంబు
  పోలుపున మోముపై ముసుఁగు గప్పి
చేదీవ నిండారఁ జిగిరించె నోయన
  దళములు విచ్చుపూవులును దాల్చి
అవయవంబుల కొక్కయర్థంబు దెలిపెడు
  లాగున నగల నలంకరించి
నగరనటి హేమకటి విటనవ్యరాగ
మత్త వాసవదత్త తా మరులు బూని
యభిసరింపంగఁ బోవుచు నాత్మపాద
మచట నతనికిఁ దవులఁగా నాఁగిపోయి.

తా నది రాయి గీచి కనె ధారుణియందులఁ గూరుచున్న య
వ్వాని ముఖారవిందమును వాని కనుంగవఁ జిందు నందముల్
వాని యనంత కాంతియును వాని నిరంతరమైన శాంతియుల్
వాని మెఱుంగు ప్రాయమును వానిబెడంగు లెసంగు కాయముల్.

వాసవదత్త యాఁదలను వాల్చి యలంతిగఁ బల్కె నిట్లు నా
దోసము గావు మో విమలతోయజలోచన! చిత్తగించి మా
వాసము చేరుమా! కఠినభాగము లీ యుపలప్రదేశముల్
నీ సుకుమారమూర్తి శయనింపగఁ గొజ్జఁగిపూల సెజ్జలే? ౬

అది యిటు లాడినంతఁ గరుణాకరుఁ డాతఁడు పల్కె సుందరీ
యిది తఱిగాదు నాకు నిటులేడకుఁ బోదువొ పొమ్ము! నాకు నొ
క్కెదను తటస్థమౌను గుటిలాలక! యిప్పుడు మర్త్యఁబోక నీ
సదన నికుంజ పుంజముల సన్నిధికిన్ విధిగాఁగ వచ్చెదన్.

జడివాన గుఱిసెఁ బడఁతుక
జడిసెన్ వాయువునఁ బ్రిలయశంఖము మ్రోఁగెన్
బిడుగులు మిన్నులమీఁదం
బొడవయి కడు నట్టహాసముం బొనరించెన్.

*
* *

నాఁటి కింకను నేఁడాది దాఁటలేదు
తలపడె వసంత మల దారితలలఁ జెట్లు
మొగ్గదొడిగె దివాణపుఁ బూలతోఁటఁ
బొగడ కలిగొట్టు రేరాణి పూలు విచ్చె.

దూరమునుండి మంద్రమగు ధోరణి గాలిని వేణుగాన మే
పారెను నెల్లరున్ మధువనాంతరమందు సుమోత్సవంబుకై
వారిని వీరినిం బిలువఁ బంపుచుఁ బోయిరి శూన్యపత్తనా
కారము చూచి కావలయుఁ గల్వాలరాయఁడు నవ్వెఁ బక్కునన్

ఎవ్వరు లేని మార్గమున నెంతయు వెన్నెల నెవ్వెలుంగునన్
బువ్విలుకాని బోలు యతిపుంగవుఁ డేఁగుచునుండెఁ గోయిలల్
క్రొవ్విరిచెట్లపైఁ గొసరికూసెను వానికి నేఁడు వచ్చెనో
సవ్వడి సేసికొంచు నభిసారపురాత్రి యొవం డటెంగెడిన్ ?

నగరంబు నెల్ల దాఁటియు
నగడితయును దాఁటిపోయి యామ్రవణమునన్
నెగడు తరుచ్ఛాయంబున
నిగనిగలాడుచు నతండు నిలువంబడియెన్.

అతని కాలిముందు నలివ యొక్కర్తుక
పాదు తెగులుచేత బాడెలుపడి
కుళ్ళుమేనితోడఁ గుక్కయై పడియుండె
మసిని జల్లినటులుఁ మచ్చలెనసి.

అంటిన ముట్టిన రోగం
బంటెడు నలదాని కుళ్ళు నంగంబు పరిజల్
కంటకును భయము చెందుచు
వెంటనె విసమట్లు పాఱవేసిరి బయటన్.

అచటఁ గూరుచుండి యతివరుం డవశమౌ
దాని తలను జేర్చెఁ దనదు తొడను
ఎండు పెదవులందు నిడె నీరు చల్లని
చందనంబు రాచెఁ జానమేన ౧౯

జరజర మొగ్గలు రాలెన్
గురుకురు మని గోకిలాళి కూసెం దరులన్
నెఱ తెఱపి వెన్నెలలచే
భరితం బై పోయి రేయి బ్రిమసి మదించెన్.

'ఈసమయంబునందుఁ దమ రెవ్వరు నాపయిఁ బ్రేమఁ బూని వేం
చేసితిరో దయామయులు చెప్పు'డటంచును నాతి పల్కఁ స
న్న్యాసియు— 'నేఁటిరేయి యదనైనది నాఁడు వచించినట్టులో
వాసవదత్త! గావునను వచ్చితి'నం చనియెన్ గృపామతిన్. ౧౨

# ఋ ణ వి మో చ న ము

( మహారత్వవదానము )

ఓరీ నిద్దురబోవుచుండితిరొ మీ రున్నారొ చన్నారొ వి
న్నారో యింకను లేదొ నాదగు ఖజానాలోన చౌర్యం బహో
మీరల్ దొంగను బట్టి యీయనియెడన్ మీ మీతలల్ నిల్వ వీ
వారంబందుల నంచు నారెకులతో వాక్రుచ్చె రా జుగ్రుఁడై.

దానితోఁ దలార్లు దారులు డొంకలు
మిట్టు బల్లములును వట్టు బర్రి
లిండ్లు గండ్లు లోని వెల్లయు గాలించి
మరలుచుండ్రి దొంగ దొరకకునికి.

నగరము వెలుపట, నొక జీ
ర్ణ గృహంబున నొకఁడు నిద్దురం బడియుండఁగ
'వగ నిదుర; వీఁడె ముచ్చ'ని
వగవక తలవరులు వాని బంధించి రొగిఁ. 3

వాఁ డొక పెద్దవర్తకుఁడు వానిది తక్షశిలాపురంబు పే
రాడఁగ వజ్రసేను, డతఁ డశ్వములం గొనివచ్చెఁ గాశికిం
దోడనె సొత్తు నంతయును దొంగలు దోఁచిరి దాన రిక్తుఁడై
పాడు గృహోదరంబునను బండె నిఁ కింటికిఁ బోవ నెంచుచున్.

వానిఁ దలార్లు పట్టుకొని వచ్చుచునుండఁగ మేడపై గవా
క్షాన వసించి యొక్కకలఁ గన్నటులం బథికప్రవాహమున్
మౌనముగా విలోకన మొనర్చుచు శ్యామ యటన్న పూర్ణచం
ద్రానన కాశిరాజసుత యల్లన నుల్ల మదెల్ల ఝల్లనన్.

అమ్మకచెల్ల! నవ్యకుసుమాంబకు వీనిని దొంగవానిగా
నమ్మి తలార్లిదే చెఱకు నడ్పుచు నుండిరి నెచ్చెలీ సము
ద్రిమ్మరియైపోయె నామనసు దబ్బున నీ వటులేఁగి ' యాకుటీ
రమ్మున కల్ల దొంగఁ గొని రండ 'ని వారలతోడఁ జెప్పవే.

శ్యామ యను మంత్రిరాజం
బామూలాగ్రముగఁ జెవులయందున సోఁకన్
స్వామి భటాళికి మేనులు
రోమాంచిత మాయెఁ బోయె రుషయు నొకింతన్.

కాశిరాజు కుమారిక క్రాలుచున్న
మేడనడిమికి నారెకుల్ మెట్టి రంత
వారివెనుకను దల వంచి వచ్చె వజ్ర
సేనుఁ డాలోహిత కపోలసీముఁ డగుచు.

'కానితతిలోన దగనట్టి వానిమీఁదఁ
గడు నయూచితముగఁ దమ కరుణ దొరలె
నే మిపుడు రాజసన్నిధి కేఁగవలయు
నమ్మ! సెలవిమ్ము నా' రెకు లనిరి పెలుచ.

అప్పుడు వజ్రసేనుఁడు రయమ్మున నెమ్మొగ మెత్తి సుందరీ!
తప్పెఱుఁగన్, దలారులకుఁ దక్కిన నన్ జెఱసాలలోని కీ
చొప్పునఁ బోవనీక యిటుఁ జుల్కన చేయుట నీకు లీలయా!
గొప్పయ? కౌతుకంబ? సమకూర్చితి బన్నముపైని బన్నమున్.

అతఁ డిటు లాడినంతటను శ్యామయు నిట్లనె నక్కటక్కటా
కుతుకమె? లీలయే? యిదియు గొప్పయె? నామెయిమేల్మి పెన్నగల్
శతము లొసంగి నీ యినుపసంకెలలన్ గొనుదాన నో గుణా
న్వితి! వినుమోయి! బన్న మిది నీయది కాదిఁక నాది చూచితే.

ఈ కరణిఁ బల్కినంతట రాకొమారి
పక్ష్మలములగు రెండు రెప్పలును దడిసె
నల్ల పొరుగూరివాని దేహంబునుండి
బన్నముం గడ్గి పాఱంగవయిచు కరణి.

'నా నగల నన్నిఁటిం గొని నగరపాలు
రార! యీతని విడువుఁ డం' చనియె శ్యామ
'ఇది యసాధ్యంబు; తేనికి నెవని తలయొ
గొనక కిను కాఁగ' దని రా రెకులు బిరాన. ౧౩

తలవరు లిట్లు పల్కుడును దామరసానన వారిచేతులన్
బలువిడిఁ బట్టుకొం 'చిదిగొ బాబులుగా! పరదేశి నీతనిన్
నిలుపుఁడు రెండు రేలు కరుణింపుఁడు చాలును మీకు నెంతయో
బలియును బున్నె మం'చనియె 'వల్లె'యటంచని రల్లయామికుల్.

మఱునాఁడు తెల్లవాఱెడు
తఱి దీపము చేతఁ బూని తరుణీమణి యా
చెఱసాల యినుపతలుపులఁ
దెఱచుచు లోనికిని జనియె దేవతవోలెన్.

అలవజ్రసేనుఁ 'డింకం
దెలవాఱును బ్రాణములను దీయుదు రంచున్
మెల మెల్ల నిష్టదైవం
బుల నెదఁ దలఁచుచును బ్రొద్దు పుచ్చుచు నుండెన్.

ఎలమి రాజసుతాకటాక్షేంగితమున
వజ్రసేనుని సంకెలల్ భటుఁడు విప్పె
వజ్రసేనుండు విస్మయవశతఁ జూచె
ఫుల్లపద్మంబువంటి రాట్పుత్రి మోము.

'కర్మ మది కట్టి కుడిపింపఁగాను బంపఁ
గవిసి బెదిరింపవచ్చు నీ కాళరాత్రి
క్షేమమున వేగుజుక్కను జేతఁదాల్చి
వచ్చు నుషవో మ దైవతవో వనరుహాక్షి! ౧౮

చచ్చెడి వానికిఁ బ్రాణము
విచ్చోటికి ముక్తి వాక్కయింత దయకు ని
ప్పచ్చర మీ పాదూరన్
లచ్చివి దయ వం చెదం దలంచెద నిన్నున్.'

అని యిటు లాడినంతటను 'ఔను దయామయి నే' యటంచు న
వ్వనిత వికావిక న్నగియె బంధనశాల సమస్తమున్ భయం
బునను వడంకె భూమిధవుపుత్రిక న వ్వాది వెర్రినవ్వుగాఁ
జనిచని యేడ్పులో దిగియె జవ్వని యంతట మాఱడిల్లుచున్.

'ఈయూరం గల గట్టిరాలగుమిలో నీశ్యామనుం బోల నే
రాయుం గల్గునె!' యంచు వాని కరపర్వం బాత్మహస్తంబుతోఁ
రాయం గైకొని వెంటఁ బెట్టుకొని కారాదేశమున్ దాఁటుచుం
బోయెం దోడ నుషోదయంబు వరణాపూరంబుపైఁ గన్పడెన్.

రేవునందున సిద్ధమై నావ యుండె
దాని యంచునఁ గాల్వెట్టి తరుణి యెక్కి
భద్రముగ నాల్గుదిక్కులు పాఱఁజూచి
నిక్కి నిలుచుండి పరదేశి నెక్కుమనియె.

నావుడు నాతఁ డెక్కఁ దదనంతరమందున నాతి పల్కె 'నో
జీవనదైవమా! వెనుకచింతలు ముందటిచింతలుం దిగం
ద్రావుచు నీదు వెంట ననురక్తిని నొక్కప్రవాహమందు నే
నీ విధిఁ దేలిపోతి నను నీవిషయంబు మరాకు మెన్నఁడున్'.

అంతట నోడవారు తెర లన్నియు విప్పిరి నావ యప్ప్రివా
హాంతరమందులం బడియె నవ్వాల నవ్వారణా తరంగిణీ
ప్రాంతవనాంతరాళముల పక్షులపాటలు తేనెయూటలై
సంతతమున్ వినంబడియెఁ జల్లనిగాలులు సోఁకె మేనికిన్.

అప్పుడు వజ్రిసేనుఁ డల యంగన మోమును నాత్మవక్షమం
దొప్పుగఁ జేర్చికొం చనియె నో చెలి యెంత ధనం బొసంగి నీ
విప్పారుగూరివాని చెఱ యీఁగఁగఁ జేసితి వీ దరిద్రుఁ డెం
తప్పును దీర్చికోవలయు? నంతయుఁ జెప్పు మిఁకో దయావతీ!

ఈమెయిఁ బలికిన యంతటఁ
ప్రేముడిచేఁ గౌఁగిలింత బిగిసికొనంగా
'ఆమాట యిపుడు కాదని
భామామణి పలికె నొక పరువిడఁ దొడఁగెన్.

నడినెత్తిపైని సూర్యుఁడు
విడిసెం బల్లియలలోని వెలఁదులు శుద్ధిం
బడయుచు బిందెలు గైకొని
తడిబట్టలతోడఁ జనిరి దారిం గనుచున్.

ప్రొద్దుటిపూఁట సంత యయిపోయెఁ దటద్వయమందుసందడుల్
రద్దుగనాయె నెంతయును గ్రామపథంబు మనుష్య హీనమై
సద్దుమడంగె నావికులు స్నానము చేసి భుజింప నావనున్
బెద్దవటంబు రేవునను నిల్పిరి నీడలు మీఁదఁ బర్వఁగన్. అవ

తోఁటలందున నీడలు దీటుకొనియె
నలసతం జెందియున్న విహంగమముల
ఝూరవంబులు కాకా రవాంతరములు
వింద మనినను నేయెడ వినఁగరావు.

పంటచేల పరీమళం బంటుకొనిన
గాలి యల శ్యామమునుఁగును గడగఁద్రోసి
పరిణయ వేగ భరంబునఁ బరవశయగు
శ్యామచెవిలోనఁ బరదేశి యనియె నిటులు :

కలికి తృణీకంబులైన శృంఖలలఁ బాపి
కట్టితివి తీయరాని శృంఖలలు నాకు
ఎట్లు సాధించితో ? నీదు ఋణ మదెల్ల
వడ్డితోఁ దీర్తు జెప్పు మూవార్త లెల్ల.

ఈమెయిఁ బలికిన యంతటఁ
బ్రేముడిచేఁ గౌఁగిలింత బిగిసికొనంగా
నామాట యిపుడు కా దని
భామామణి పలికె నొక పరుగిడఁ దొడఁగెఁ.

పైడి తారిడులు వెలుఁగు చాఁపలను ముడిచి
వేవెలుఁగు టోడ యస్త్రాద్రి రేవుఁ జేర
నొడ్డులకు నానుకొనియున్న యుపవనముల
చల్లగాలులు నావ కల్లల్లఁ దగిలె

చవితి చంద్రుండు చనుచుండె శాంతమైన
నీట వెన్నెల నిడుదదై నిగనిగమనె
చెట్లపాదుల చీకటుల్ ఝిల్లి రొదల
వడఁకఁ దొడఁగెను వీణతీవల విధాన

ఆయెడ దీప మార్పి యలయంగన చల్లనిగాలి కల్ల వా
తాయనమందుల న్నిలిచి యాయత కేశకలాప మా విదే
శీయుని వక్షమందులను చీఁకటియేఁఱయి పాఱుచుండఁగాఁ
జేయుచు వానిమూఁపునను జేయిడి యిట్లనె మెల్లమెల్లగన్.

నీకొఱకే నొనర్చినది నిక్కము కష్టము చాలఁ గష్ట మా
రా కడుఁ గష్ట మాపనిని నట్టులు చేయుటకంటెఁ జెప్పుటల్
నాకును జాలఁ గష్ట మయినన్ వచియించెద సంగ్రహంబుగా
నాకత నీవు విన్నపయి స్వాంతమునుండి తొలంచివైవుమా!

ఉత్తీయుండను రాచకుర్రఁ డొకఁ డెంతో ప్రేమ హాలామదో
న్మత్తుండై నను నేడిపించు నతఁ డీ నా కోర్కిచేఁ జౌర్యమున్
నెత్తిం దాల్చుచుఁ బ్రాణ మిచ్చె నిటుల న్నీకోసమేఁ జేయుటం
జిత్తంబందున నాకు గౌరవముగాఁ జింతింతు సర్వోత్తమా!

కలువల రాయఁడు క్రుంకెను
బలువులుఁగుల నిదుర నెత్తిపయిఁ దాల్చుచొగన్
జలనంబును శబ్దంబును
వలఁతియు లేకుండె నప్పు డడవి యదెల్లన్. 30

అల్లన వజ్రసేనుకర మంగన పెంగటినుండి జాఱె నా
యల్లక మప్పు డా యుభయులందున మూగదియై వసించెఁదాఁ
బల్లక వజ్రసేనుఁ డొక ప్రస్తరమా యనిపించె శ్యామ యా
వల్లభు కౌఁగిలింతఁ దెగి వాని పదంబులవ్రాలెఁ దీవనన్.

శ్యామ తటాలున న్నెగసి యాతని జానువు లాత్మబాహువులన్
దామెనకట్టి యిట్లనియె 'నాదగు పాపముచూచి బ్రహ్మ తా
నేమెయి శిక్షయేని విధియించుత దాని భరింతుఁగాని నా
స్వామికి నీకుఁగాను నెది సల్పితినో యది నీవు సైపుమా.'

అనవుడు నాత్మజానువుల నాతఁడు వెన్కకులాగి రాచకూఁ
తును గని 'నాదు ప్రాణములతోఁ బనియే మది కల్గె నీకు? నీ
ఘనమగు పాతకంబువెలఁ గట్టి కటా యుసురుల్ గ్రహించి నా
మనికి సమస్తమెప్పటికి మైల యొనర్చితి వేమిచెప్పుదున్ ?

ఓసి పిశాచి నాయెలుక నొందక చేసితి విట్లు నాదు ని
శ్వాసము నీకుఁ జాల ఋణపడ్డది నాకొక రెప్పపాటునన్
వాసికిఁ గా డెఁకంచుఁ గఠినంబుగ నాచి వచించి నొకనుం
బాసి తటాలునం జనియెఁ బాదము లేఁగిన చొప్పునన్ వనిన్.

ఇడిన పాదముక్రింద నెండుటాకుల మర
మరలచే నలవనీ మహి చలించె
వాయు ప్రసారంబు వనతలంబునలేమి
గుల్మగంధంబులు గుట్టబడియె

చీకిరి బాకిరి పాఁకిన కొమ్మలు
తమముచే వికృతరూపములు దాల్చె
పోవల దనునట్లు తోఁవ లన్నియు మూసి
యల్లిబిల్లిగఁ దీవ లల్లుకొనియె.
తాను వచ్చిన దారియు ధరణిఁ గలసె
బడలి కూర్చుండె నచట నా బాటసారి
వానివెనుక నుపచ్ఛాయవలెను వచ్చి
యెడగ నిలుచున్నయట్టివా రెవరు చెపుమ?

గుప్పిలి బట్టి యాతఁ డలికుంతల నిప్పులచూడ్కిఁ జూచి నీ
విప్పటికేని న న్విడిచి యేఁగవుగా యని గర్జిలంగ నా
కప్పురగంది మించుగతిగాఁ జనుదెంచుచుఁ గొండవాగునం
దెప్పలు దేల్చు పెందరఁగతీరున నాతని నావరించుచున్.

జిలిబిలి పలుకుల బిగి కౌఁ
గిళులన్ ముద్దులను నలఁతిగిలిగింతల నూ
ర్పులను జెమర్పులను వగ
ర్పుల నల చెలికాని ముంచి మోహముతోడన్.

నిన్నున్ వీడను నిన్ను వీడ ననుచున్ వేమాఱు భాషించుచున్
నన్నున్ వీడకు నేను నీకొఱ కొగిన్ గావించు పాపంబునున్
మన్నింపంగను జూడు కానియెడలన్ నన్నుం దెగం జూచి యీ
యన్యాయంబును సున్నజుట్టు మనుచున్ యాచించె నత్యార్తయై

వేలకొలంది భూమిఁగల వేళ్ళు వడంకెను జీఁకటుల్ భయో
ద్వేలత గ్రుడ్డిగా ననుభవించెను నంతిమయాచనా స్వరం
బాలిగ నూర్పుల న్నలిఁగి యాఁగె ననంతరమందు నెవ్వరో
నేలపయిన్ వడిం బడిన నిష్ఠుర శబ్ద మెసంగె ముంగలన్.

వజ్రిసేనుండు చొఱరాని వనమునుండి
క్రిచ్చఱం గ్రిమ్మరిలి వేగ వచ్చునరికి
గంగయొడ్డున నీశ్వరాగార శిఖర
మరుణకాంతుల నిగనిగలాడఁ దొడఁగె.

వజ్రిసేనుండు తా వెర్రివానివోలె
ఏటియొడ్డున నొక్కపుర్వేని లేని
యిసుక దిన్నెలయందున నెల్లపొద్దు
గడఁపె మాటాడకుండ నొక్కఁడును నెట్లో.

అల్ల మధ్యాహ్నభాస్కరుం డగ్నికశల
నతని మోఁదెను జలకుంభహస్తైన
పల్లెవెలఁదుక 'లో యిల్లు బట్టనట్టి
పిల్లఁడా! రమ్మ'టంచును బిలిచి రతని.

దప్పికచేత నాలుకయుఁ దాలుయుగంబును నెండిపోవుచు
న్నప్పటి కాతఁ డెట్టెదుట హస్తముచేరువ గంగపాఱు చు
న్నప్పటి కొక్కబిందువును నైనను ముట్టఁడు; లేఁతవెన్నెలల్
గప్పెను నంకపాంకములుగాఁ దగిలెన్ జ్వర మల్లవానికిన్. ౨౧

అల వజ్రసేనుఁ డాగ్రహ
బలమున నొకపరుగు దీసి పడవం బడియెన్
బలు మంటఁ జూచి కడు న
ర్మిలి రివ్వున నెగిరిపడెడు మిడుతంబోలెన్.

అక్కడి పానుపుమీఁదను
నొక్కందియ యుండె నాతఁ డుడుగక దానిం
జిక్కని చూపులఁ జూచుచు
నక్కునఁ దా నొత్తుకొనియె హస్తయుగమునన్.

అతని హృదయాంతరాళ
స్థితమయి యల నూపురంబు చిత్రవిచిత్ర
కృతులను ననుకృతిఁ జేయుచు
శతముఖముల వజ్ర మనఁగ ఝంకారించెన్.

ఆతఁ డంతట శ్యామ పీతాంబరములఁ
బ్రోవుగాఁ జేసి దానిపై మోము వాల్చి
దానఁ బొల్చెడి మేని నెత్తావి యెల్లఁ
బీల్చెఁ దనివోని వెఱ్ఱియావేశమునను.

అంత నస్తాచలేంద్రానుయాయి యైన
శుక్లపక్షపుఁ బంచమీ సోముఁ డల్ల
నల్ల నేడాకుల యనంటి యగ్రమందు
పాద మిడి జాఱి పడియెఁ దత్పర్వములను. ౧౭

అల వజ్రసేనుఁ డంతటఁ
బలువడి నప్పడవ నెక్కి బాహుద్వయి ముం
గలకున్ జాఁపుచు రమ్మా
చెలి! రమ్మా చెలి! యటంచుఁ జెచ్చెరఁ బిలిచెన్.

అప్పు డరణ్యమునన్ సడి
సప్పుడు లేకుండ నొక్క ఛాయ నడచుచుం
జప్పున రాఁగడఁగెఁ గడల్
గప్పిన చీఁకటుల నేటిగట్టున కంతన్.

వాని ముందు నుపచ్ఛాయవలెను వచ్చి
యెడగ నిలుచున్నయట్టి వా రెవరు చెప్పుమ?
'చెలియ! రారమ్ము ర'మ్మంచుఁ బిలిచె నతఁడు
'వచ్చితి' న టంచుఁ బలికె నవ్వామనయన.

అంతట రాచబిడ్డ యలయాతని పాదములందు వ్రాలి నీ
వింతటితో క్షమింపు మిఁక నింతటితో క్షమియింపుమీ దయా
క్రాంతము నీదు దక్షిణకరంబున నా కఠినంపుఁ బ్రాణముల్
సొంతము గావుగా యనియె శక్తియడంగు స్వరంబుతోడుతన్.

అనవుడు వజ్రసేనుఁ డల యంగననున్ క్షణమాత్ర మర్మిలిం
గని క్షణకాల మామె బిగికౌఁగిటఁ జాలఁ జమత్కృతాత్ముఁడై
తనరియు నంత నామె దవుదప్పుగ నెవ్వఁడిఁ ద్రోసిపుచ్చి యో
వనితరొ యేల వచ్చితివి? వచ్చితివేల? యటంచు గర్జిలెన్. ౬౧

గుండియలఁ గాల్చు నంగారఖండమైన
నూపురము దీసి గంగయందులను వైచె
వలువ లన్నింటి నావలఁ బాఱఁ జిమ్మె
శయ్య యది యగ్నిశయ్యగా నయ్యె నపుడు.

అంత నాతండు నెమ్మోము నటు మరల్చి
కన్నులను మూసికొనుచు నక్కలికితోడ
'మరలి పొమ్మింక నన్నును మఱచిపొమ్ము
వెనుక కేఁగుము వేగిరం' బనుచుఁ బలికె.

అంతట రాచపట్టి శిర మల్లనవాల్చి క్షణంబు మాటయున్
మంతియులేక రాతిప్రతిమన్ బలె నిల్చి పరక్షణంబునన్
శాంతి భజించి భూతలమునం దన జానువు లాన్చి వాని పా
దాంతికమందు భక్తి వెలయం బ్రణమిల్లి యనంతరంబునన్.

ఏటిదరి కాఱడవి పేరుటిరులలోన
ఓయనోయన నడచుచు మాయమాయె
కలఁత నిద్దుర నొకవింత కల క్షణంబు
లోన నిశిచీకటుల మాయమైన యటులు. ఉగి

# కొలఁది నష్టము

( దివ్యావదానమాల )

మాఘమాసంబునందున మంచునకును
దోడి యల్లుండు చలిగాలి తోలుచుండె
అల్ల వరుణాతరంగిణి నల్లనీరు
పాముచందాన జలజలఁ బాఱుచుండె.

కాశికారాజు నిల్లాలు కరుణ యన్న
తరుణి నగరికి దవ్వుగాఁ దనరు నొక్క
పల్లెకడ సంపెఁగలతోఁట ప్రక్క రేవు
నందు నోలాడఁ జనె సకియలను గూడి.

జేని సమాజ్ఞచేత నల రేవున గ్రామమునందు నొక్క పి
ట్టైనను లేదుగాని దవులందు వనంబులఁ బక్షికాకలీ
గానము మధ్యమధ్య వినఁగాఁబడియెన్ వరుణాతరంగిణీ
మానతటంబు దాన నసమానగభీరత దాల్చె నెంతయున్. 3

ఉత్తరవాయు వున్మత్తమై వీచె న
ప్పుడు తరంగిణియెల్ల బొంగిపొడిచె
నీరిపై బంగారునిగనిగల్ ప్రసరించె
నలలెల్లఁ బులకించి యాటయాడు
గాణిక్యమనఁ గోటిమాణిక్యధగధగ
లంచలంబునఁ బోసికొంచుఁ జనియె
కాంతామతల్లుల కాకల మప్పుడు
కలతరంగముల సిగ్గిలగఁజేసె
తమ్మితూడులచేతు లందముగఁ ద్రిప్పి
నురుగునగవుల మత్తిల్లె వరుణయెల్ల
కలికిమాటలఁ జిమ్ములాటలను నీటి
బుడబుడధ్వనిఁ జదలెల్ల బూరటిల్లె.

ఉవిదలు మెల్లనొక్కొక్కరె యొడ్డున కెక్కినయంతఁ దా నను
త్పవముగ రాణి 'నేఁజలికిఁ జచ్చుచునుంటిని మే నిదెల్లయున్
జివజివలాడెఁ గాళ్ళులును జేతులుఁ గొంకరవోయె వెంటనే
యవి యివి ప్రోగుజేసి యిట నగ్ని నొనర్పుడటంచుఁ బల్కినన్.

చితుకుల నేఱితెచ్చుటకుఁ జెల్వలు సంపెఁగతోఁటకుం ద్వారా
న్వితలయి పోయి యచ్చటను వేడుకపెంపునఁ గొమ్మలన్నిఁటిన్
గులికల కంట గొడ్డఁటను గొట్టుచునుండఁగ రాణి చూచి యా
యతివల నందఱిం బిలిచి యమ్మునిముంగలఁ జేతఁజూపుచున్. ౬

మీరును మీరు పొండటకు మీరామెదుటం గనుపట్టు పాక యె
వ్వారిదియేని దానికిని వహ్నిఁ దగుల్పు వాఁడు చిన్నమంటతో
వారణ చేయఁజాలఁ జలిబాధను వెంటనె నిప్పు పెట్టుఁ డం
చా రమణీలలామ దరహాస మొనర్చెఁ బ్రమోదమత్తయై.

కలిమియు లేమియుం దెలియఁ గల్గిన మాలతి యన్న దాసి తా
నలఁతిగఁ బల్కె నిట్లు—'చెరలాటము పిల్లికిఁ బ్రాణసంకటం
బెలుకకు' నంచు నెందు వినమే? పరిహాసమునందు నేని సుం
తిలువడి వద్దె! యా గుడిసె యే మునిదో మఱి యే బికారిదో!'

రాణి యంత రోషరక్తాంగియై పల్కె
—'ఎంత జాలి! పాప మెంత నాలి!
మెలఁతలార! దీని మెడ గట్టిగాఁ బట్టి
గెంటివైవుఁ డవలి కొంటిగాఁగ'

అడఁపఁగరాని వేడ్క యెసలారఁగ మాలతిఁ ద్రోసి వెర్రులై
పడఁతుక లందఱుం గలిసి పాకకు నిప్పు రగిల్చి యార్చి ర
వ్వడ యొక ధూమదండము నభోమణిఁ గప్పుచు నగ్నికుండమై
వెడలి శిఖాసహస్రముల వెల్గెను గాలియుఁ దోడ్పడెన్ వెసన్.

పాతాళంబు పగిల్చికొం చెగయుచున్ జ్వాలాకృతుల్ పన్నగ
వ్రాతంబుల్ దివికేసి పెద్దపడగల్ పైకెత్తి బిట్టాడి న
ల్లైతోచెం బ్రలయప్రమత్త లగు నయ్యో స్త్రీల కర్ణంబులం
బ్రాఁతిన్ దీపకరాగిణుల్* మొరయ నారంభించె నశ్రాంతమున్.

* ఈ యాలాపనచే నిప్పు పుట్టునని ఐతిహ్యములు కలవు.

పొద్దుటింతలఁ బిట్టల ముద్దు పాట
లేదుపులుగాఁగ మాఱిపోయెను బిరాన
ఆకులుం గొమ్మలున్ రెమ్మ లవనిజములు
కాలి దోసెఁడు బూడిదగాఁగ నాయె.

ఒకగుడిసెనుండి మఱి వే
ఱొకగుడిసెకుఁ గోఁతివోలె నొగి దూఁకి మహా
ధికమైన యగ్ని గ్రామము
సకలము తగులంగఁ బెట్టె చనె నిముసములోన్.

సంతోసము వెగటయి చనఁ
గాంతలతో నెవరులేసి ఘంటాపథమం
దంతటను రాణి చనె ని
శ్చింతముగా నల్లఁగలువ చేతం గొంచున్.

అపుడు రాజు తా సభాగారమం దుండె
గ్రామజనులు గుంపుగట్టి వచ్చి
ఇనుమడించు భీతి నెట్టెటో బిగఁబట్టి
చిచ్చుచెట్ట మనవి చేసికొనిరి.

రాజు సభాసనంబు విడి రక్తముఖుం డయి కాని వేళలో
రాజపురంధ్రి ముంగిటను వ్రాలి 'యహో మహిపా! యిదేటి దుర్
వ్యాజము? భాగ్యహీనుల గృహంబులనుం దగులంగఁబెట్టు టే
రాజుల ధర్మ మిత్యాది కరంబువచింపు మ'టంచుఁ బల్కెనన్.

'ఏమియెఱింగి వాని నిటు లిండ్ల నుచుంటివో గాని యొండొ రెం
డో మఱిమూఁడో ప్రాగుడిసెలుండెనో మండెనో! యెంతమందికిఁ
బాములు గల్గెనోటు! జనపాలుని పట్టపుదేవి కొక్కఁడా
జాముసుఖాన కెంత ధనజాలము ఖర్చగునో యెఱుంగవే!

గుడిసెలు రెండో మూఁడో
దడదడగాఁ గాలెననుము దానికి నిట్టుల్
గడుఁ బెద్ద సేయవల దె
క్కుడు నష్టములేదు చాలఁ గొలఁది యిదిసుమీ.

అనుచును రాడ్భామిని యో
ర్పును దా దిగనాడి చాల రుసరుసలాడెన్
జనపతి దీప్తంబగు నె
మ్మనమున రోసంబు మాటి మఱి యి ట్లనియెన్.

'ఎన్నాళ్లీ విటు రాణివాసమున నెంతే రాణివై యుందువో
యన్నాళ్లున్ నిఱుపేదవారి యలఁతన్ హానిన్ గ్రహింపంగ లే
వన్నన్నా యది నే నెఱుంగుదును సత్యం బింతటన్ నీకు నా
తెన్నెట్లో యది తెల్పఁగా వలయుఁగొంతే నిప్పుడో నిర్దయా!'

అంత రాజునాన నరుదెంచి యొకదాసి
రాణి నగల నన్ని రాల్చి వైచి
కట్టుకొన్న పట్టుపుట్టంబు బదులుగా
చింపి పాఁత యొకటి చేతి కిచ్చె. —౨౧

ఆమెయి రాజవీథికిని నామె వడిం గొనిపోయి రాజు తా
నీమెయిఁ బల్కె— 'ఇంక నిలునిల్లును బిచ్చమునెత్తి యొక్కఁడో
జామునుఖాన కే కొలఁదిసంఖ్యల గీములఁ గాల్చినావో యా
గీములఁ గట్టి యిచ్చి పయిఁ గిమ్మనకుండఁగ రమ్ము పొమ్మొగిన్.

ఏఁడాది యిడితి గడు వీ
యేఁడాది చనంగ వచ్చి యీ సభకుం జే
మోడిచి చెప్పుము కాల్చిన
నాఁ డొదవిన యా కొలంది నష్టం బెంతో.' ౨౩

# మూల్య ప్రాప్తి

(అవదానశతకము)

మార్గశీర్షంబునందున మంచుగాలి
తోలుటం జేసి పద్మముల్ తునిసిపోయె
అల సుదాసుని లేఁదోఁట కొలఁకునందు
కంజ మొక్కటి యెట్టులో కాని విచ్చె.

తమ్మిని గోసి సుదాసుం
డమ్మం జూపంగఁ గోట ద్వారమ్ము సమీ
పమ్మునకుం జని వేచెను
నమ్మహిపుని దర్శనంబు నాసించు చెదన్.

దారినిఁ బోవువాఁ డొకఁడు తామరపూవును జూచి మోద మే
పార శరీర మెల్లఁ బులకాంచితమై చన బుద్ధదేవుఁ డీ
యూరికి వచ్చె వారి పదయుగ్మమునందులఁ గానుకయిత్తునం
చారసి య య్యకాలవికచాంబుజపున్ వెల తెల్పఁగోరినన్. 3

మాలి యంత నొక్క మాషంబు బంగారు
తమ్మి కేను బడయఁదలఁతు ననియె
అంత వెలనుగూడ నల పాంథుఁ డీయంగ
నుల్లమందుఁ జాల నుత్సహించె.

అత్తఱిఁ దా ననర్ఘమగు నర్ఘ్యము పూని ప్రసేనజిత్తక
స్మాత్తుగ వచ్చి ముంగిటను మంగళగీతము పాడి బుద్ధదే
వోత్తము దర్శనంబు గొన నొయ్యన నేఁగు చకాల పద్మముం
గ్రొత్తగఁజూచి 'యెంతవెల? కొందును బుద్ధున కిత్తు' నంచనెన్.

మాలి పల్కె 'రాజ! మాషంబు బంగార
మర్ఘ్య మిచ్చె నిమ్మహాశయుండు'
అనిన 'మాషదశక మర్పింతు' ననె రాజు
'పదులు రెండ' టనియె బాటసారి.

నా కిమ్మంచును నాకు నిమ్మనుచు భూనాథుండు పాంథుండు తద్
వ్యాకోచాంబుజమూల్యముం బెనుచుచున్ వాదింపఁగా మాలియా
వ్యాకోచాంబుజ మేరికోస మిటు లీ యర్ఘంబునుం జెందె నా
లోకాతీతున కీయ నెంత ఫలమున్ లోఁగొందునో' యంచొగిన్.

'చిత్తమండి తమకుఁ జేతులు జోడింతు
నను క్షమించుకొండి నళిన మిద్ది
అమ్మఁజాలనండి' యని పల్కి బుద్ధుని
వనముచెంత కొక్క పరుగు దీసె. ర

కన్నుల తుదనుండి కరుణారసం బూర
మోవియంచున నవ్వు మోసులెత్త
నవ్విన నవ్వునఁ బువ్వులు రాలంగ
శాంతిప్రసన్నతల్ సందడింప
ముఖమండలంబున ముచ్చిచ్చులును గ్రాలి
ముద్దుగా నానందముద్ర దొలఁక
మదినుండి నిర్వాణమధువు పైకుబుకంగ
మూర్తియెల్ల వెలుంగుముద్ద గాఁగ
క్షుద్రమానవగణము చేకూర్చుకొన్న
పాతకంబుల కెల్లను బ్రతినిధి యయి
బుద్ధదేవుండు ధర్మసన్నద్ధుఁ డగుచుఁ
గుదిరి పద్మాసనంబునఁ గూరుచుండె.

అల్లనుదాసుఁ డా సుగతు నారయు చట్టులె విస్తుపోయి ప
ల్కొల్లక తెప్పవాల్పఁగను నొల్లక దండములీల నేలపైఁ
జల్లఁగ వ్రాలి శాక్యమునిసత్తము శ్రీపదపంకజంబులన్
మెల్లగఁ బంకజం బిడియె మిక్కుటమైన ప్రపత్తితోడుతన్.

అమృతవృష్టి కురిసి యలబుద్ధుఁ డిటు వల్కె—‘
కుర్ర! చెప్పుమ నీదుకోర్కె సుంత’
‘తమదు పాదధూళి తక్కంగ నే కోర్కె
తోఁపఁబోద ’టనియెఁ దోఁటమాలి ౧౧

# నగరలక్ష్మి

(కల్పద్రుమావదాన)

శ్రావస్తీనగరంబునం గఱ వాఁగిన్ సంధిల్ల దీనప్రజా
రావంబుల్ విని బుద్ధదేవుఁ డల యార్తప్రాణిలోకంబునుం
గావన్ భక్తుల నెల్లవారిఁ గని వక్కాణించె నీ రీతి ‘మీ
రేవా రీయెడ నన్నదాన మిడఁగా నేతెంతురో చెప్పుఁడా.’

అనఁగా విని రత్నాకరుఁ
డను కోమటి తలను వంచి సాంజలియై యి
ట్లనె ‘నీ పురి యాఁకటి చి
చ్చును నార్పెడి శక్తి నాకు సున్న మహాత్మా!’

అంత జయసేనుఁ డన్న సామంతుఁ డనియె
‘దేవ! వలసినచో గుండె దీసి యిత్తుఁ-
గాని యిడఁజాల నొక్క యన్నకబళ మేను
అన్న మది మాకె హాల్లికి హాల్లి’ యంచు.

అంత ధర్మపాలుఁ డనె నిట్లు నిట్టూర్చి
‘ప్రభువ నాది యెంత పాడు బ్రతుకొ!
పైఁడి పండు పొలము పస్సైనఁ బండదు
వట్టి పనికిమాలువాఁడ నేను!

మోముల్ మోములుఁ జూచుకొంచు వెనుకల్ ముందుల్
విచారించుకొం
చామై నోలగ మెల్ల మాట పడినట్లై యుండఁగా దుర్భర
క్షామంబేర్చిన వీటిపై మణిసభాగారంబుపైనిన్ దయా
ధామంబౌ జినుకన్ను లొప్పెసఁగె సంధ్యాతారకాకారమై.

అప్పు డనాథపిండదుని యాత్మజ సుప్రియ నమ్రమౌ శిరం
బొప్పఁగ బుద్ధదేవు పదయుగ్మమునం దిడి నీరు కన్నులన్
గప్పఁగ—'నీ బికారి తమకట్టడిఁ గైకొనెనయ్య! తిండికిన్
దప్పినవారు నా సుతులు, తద్భర మెల్లయు నాది' యం చనెన్.

విస్మయము చెంది యెల్లరు బిచ్చకత్తె!
'యే యహంకారమదమున నిట్టిపనిని
నెత్తిపయిఁ బెట్టికొంటివో! నీవ దెట్లు
చేయఁగలదానవో! సుంత చెప్పు' మనిన.

ఆమె మ్రొక్కి యనియె 'నక్షయపాత్రమే
కలదు నాకు నేను కడు బికారి
దానఁజేసి తమదు దయ చూరగొందును
పార మొందఁగలదు ప్రభువునాజ్ఞ.

ఆరయఁ బుణ్యులైన తమయందఱ యిండులయందు నాదు భం
డారము నిండుగాఁగలదు నాదగు పాత్రము మీర లెల్లఁగ
న్నార ననుగ్రహించినను నక్షయమయ్యెడు, దీనితో గృహ
ద్వారములన్నియుం దిరిగి యాఁకటి చిచ్చును నార్పివై చెదన్.౯

# అవమానవరము

(భక్తమాల)

భక్తుండైన కబీరు సిద్ధుఁడనుచుం బ్రఖ్యాతి దేశంబులన్
సక్తంబాయెను బాలవృద్ధజనముల్ సన్న్యాసులుం జానలున్
రిక్తుల్ కుంటులు లోనుగా నవయువార్తిం బొందువా రజ్ఞులున్
రక్తిం జేరఁగ వానిపాక యొక తీర్థంబాయె ముప్పొద్దులున్.

మంత్ర మొక్కటి పల్కి మారోగమును బాప
వే యంచు దీనులై వేఁడువారు
వేరు నొక్కటికట్టి బిడ్డలఁ గనఁగ నా
శీర్వదింపవె యంచుఁ జేరువారు
శరము చుట్టును ద్రిప్పి కన్నులనుం బ్రసా
దింపవే యంచు నుతించువారు
దేవుఁ డున్నాఁడేమి దీనికి దాఖలా
యేమి యంచును వాద మెత్తువారు
రసనమీఁదను బీజాక్షరములు వ్రాసి
విద్య నిడుమంచు నెంతయు వేఁపువారు
ఇటులు వేధింప రేఁబవ ల్లెల్లవారు
భీరుఁ డగుచును నిటులు కబిరు తలఁచె. ౧

"నీ కరుణావశంబున జనించితి మ్లేచ్ఛునియింట దానిచే
నాకొఱ కేరు రాకునికి నాకును నీకు నిఁ కేరి యడ్డమున్
లేకునికిం దలంచితిని నీ విది యారసి నాగ్రహంబు లో
కైకగ్రహంబు సేయుచుఁ బలాయనముం బొనరింతువే ప్రభూ!"

*
* *

పత్తన మెల్ల మ్లేచ్ఛపదపాంసువులం దలఁ దాల్చుచుంట వి
ప్రోత్తము లోర్వలేక యొహూహో కలి పాదచతుష్టయంబుతో
నిత్తఱి వచ్చె నీతనికి నింతట శాస్తిని జేయకున్నచో
నుత్తరమా క్షణంబుననె యుర్వి బదాబదలై నశింపదే?

అంచు వార లెల్ల నాత్మలోఁ దలపోసి
అంకుటాలి నొకతె రాఁగఁ బిలిచి
అడిగినంత డబ్బు నిడుచు నల్ల కబీరు
నెట్టులేని దూఱుపెట్టు మనిరి.

సంతరోజున నొకనాఁడు శాటి నమ్మ
నంగడికిఁ బోయె నక్కబీ రప్పు డతివ
అందఱుం జూచుచుండంగ నావురు మని
గట్టిగా వాని నడుమును బట్టి యేడ్చె. ౬

ఓరి శఠుండ ధూర్తుఁడ మహాభోగుఁడ! యియ్యది నోరులేని దే
వ్వారికిఁ జెప్పఁబో దనుచు వంచన చేయుదె? తప్పు లేని న
న్నీరహిఁ బీడనాడి మఱి యీావటు వేసెదె సాధువేష మా
హారము నీక వస్త్ర మిడ కాడికతో విడియాకు లిత్తువే?

అను చిటు దూఱఁ జేరువల నారయు పాఱులు వట్టి కిన్కఁ నా
తనిఁ గని 'దొంగ! ధర్మవని ధర్మవు నాశముచేసి యే మెఱుం
గని గతి నెల్ల లోకముల కన్నుల దుమ్మును జల్లుదే? పతిం
గనియును దౌర్భాగ్యయా సతికి గ్రాసము వాసము దూరమాయెనే!'

అనఁ గబీరు వల్కెఁ నపరాధి నో సతీ!
రమ్ము వేగ నా గృహమ్మునకును
నాకు నన్న మున్న నీకేల లేకుండు?
నాకు వస్త్రమున్న నీకు నుండు.

*
* *

వినయంబున నాదరమునఁ
దనయింటికిఁ గొంచుఁ బోయి దానినిఁ గని యో
జననీ! శ్రీహరి నిన్నునఁ
బనిచెను నీచాతినీచు భవనంబునకున్. ౧౦

అనుచుఁ గబీరు వల్క నల యంగన యంతయుఁ జూచి లోన నే
ననుకొనినట్లుగాక కథ యడ్డముగాఁ దిరిగెంగదా యటం
చనుకొని యయ్యొ! యక్కటకటా! తమమీఁదను నింద మోపి సం
తనగను నెత్తుకొంటి నిదె నాదగు నెత్తిని మృత్యుదేవతన్.

అనుచును సిగ్గునం గడు భయంబునఁ గంపిలు దానిఁ జూచి 'యో
జననిరో! యిందు నీ దోసఁ గెసంగదు సుంతయు నీవు తెచ్చు నిం
దను దల మానికంబుగతిఁ దాల్చితి నంచుఁ గబీరువల్కి యం
గనకును భక్తి నిచ్చె హరిగానమునన్ మధురస్వరంబునన్.

అంతన్ దిగ్దేశంబుల
నంతటను గబీరు నీచుఁ డంచును గడు సి
ద్ధాంతం బాయెఁ గబీరును
నంతఃకరణంబునందు ననుకొనె నిట్టుల్.

ఒడ్డొకించుక దొరకుచో నోడగడఁపు
గరువ మది యేల నాకు నో పరమపురుష!
నీవు నాలోన నున్నచో నే నిఁకెల్ల
వారికన్నను గడుఁ గ్రింది పదవి నుందు. ౧౬

*
* *

బంటొక్కఁ డల మహాత్ముని
యింటికిఁ దా వచ్చి 'యయ్యా! యేలిక మిముఁ గ
న్గొంటకు వేడుకపడె; నా
వెంటనె తా మిపుడె సభకు వేంచేయవలెన్.'

అనఁ గబీరువల్కెన్: 'నక్కటా వ్రాత్యుండ
రాజసభకు నెట్లు రాఁగ నేర్తు?'
దూతవల్కెన్; 'మీరు తోడ్తోడ రానిచో
మాట వచ్చు, మునుఁగు మాదుకొంప.'



ఏలిక కొల్వునందు వసియించెను బ్రాహ్మణరాజ వైశ్య శూ
ద్రాళులు వేలువేలుగను నందుల బారులు తీర్చియుండి రో
డ్డోలగ మొల్లఁ గౌతుక మహోత్సవమందు మునింగి తేలె న
వ్వేళఁ గబీరు వచ్చెఁ దనవెంట వెలందినిఁ గొంచు నెంతయున్

ఆ లలితాంగి వెంటఁ గొని యాడకు వచ్చు కబీరుఁ గాంచి పే
రోలగ మున్నవారు తల లూయ్యన వంచెడివారు భ్రూకుటీ
చాలన జేయువారు విరసంబుగ నవ్వెడువారు చూచి భూ
పాలకు చెంత కీ గతిగ వచ్చునె యం చనువారు నైరొగిన్. ౧౮

ఎంతటి లజ్జాహీనుఁ డో
కాంతను వెనువెంటఁ గొంచుఁ గడుఁ ద్రిమ్మరు నం
చెంతయు మది రోసెను భూ
కాంతుండు కబీరు గాంచి క్షణమాత్రమునన్.

అంగజాలె రాజు నింగితంబు నెఱింగి
యలకబీరు వెలికి ననిచి పుచ్చె
కూడఁగూడఁ జేడెఁ గొంచుఁ గబీ రేఁగె
దన కుటీరమునకు వినయమొప్ప.

బాటలయందుల న్నిలిచి బాపనసాములు నిండు వేడ్కతో
మాటికిమాటికిన్ నగి యమానుషవాక్యము లాడినంత నా
బోటి కబీరుముంగలను మోఁకరిలంబడి 'రొంపినుండి న
న్నేటికిఁ దీసి యింట నిడి యీ యవమానము గొందువో ప్రభూ'

అని బోటి పల్కినంతన్
వినయముతోడుతఁ గబ్బీరు 'నీ వున్నావే
జననీ నా ప్రభు విచ్చిన
యనూనమగు వరమ వంచు నల్లనఁ బలికెన్. ౨౨

# స్వామిలాభము

(భక్తమాల)

తులసీదాసుఁ డొకానొక
మలుసంజ శ్మశానమందు మనన ధ్యానం
బుల గానంబులఁ దనలో
పలఁ దానే సంతసంబు వడయుచు నంతన్.

మృతిఁ గను భర్తపాదములమీఁదఁ దలం దగిలించి యేడ్చుచుం
బతి చితి మీఁద నంతట గుబాలున దూఁకెడుదానిఁజూచు చా
సతి వలగొన్న నెచ్చెలుల సంస్తవముల్ జయనాదముం బురో
హితులయు సాధునాదము నహీనుఁ డతండు వినెం దటాలునన్.

ఆ సతియు నంతఁ దులసీ
దాసుంగని భక్తితోడ దండం బిడి యా
దాసికి దమ శ్రీముఖమునఁ
గాసంత యనుజ్ఞ యీయఁ గావలె ననినన్. 3

ఏడ కేఁగనమ్మ యింత యీ ప్రయోజనం
బనియెఁ దులసిదాసుఁ డధిక కృపను
భర్తతోడ నేను స్వర్గంబునకుఁ బోదు
ననియె నల పతివ్రతాళిమాళి.

ఇల వీడి స్వర్గమందలి
తలఁపేలా తల్లి యం చతఁడు నగి యనె ని
ట్లల స్వర్గం బేవారిదో
యిలమాత్రము సుంత వారి దేలా కాదో?

తులసీదాసుమనంబును
దెలియక యనె నామె భర్తృ దేవతఁ బడయం
గలదాననేని స్వామీ
యల స్వర్గం బెడమ కాల నావల ద్రోతున్.

నవ్వి తులసిదాసుఁ డవ్వ! యింటికి నేఁగు!
నాదుమాట నుంచు నమ్మకంబు
నేఁటినుండి యొక్క నెలపైని నీభర్తఁ
బడయఁ గలవటంచుఁ బలికె నంత.

అల్ల పతిభక్త యెంతయు నాసజేసి
వల్లకాటిని విడి యేగె వాసమునకు
అతఁడు చెప్పిన మంత్రంబు ననునిమేష
మామె జపియించె శుద్ధమానంతరాత్మ.

నెల యొకఁ డంత నెంతయును నిండిన యంతట నెంతమందియో
కొలకొలమంచుమించి యిరుగుంబొరుగున్ జవరాండ్రు వేడుకన్
బలబలమూఁగి 'నీమగఁడు వచ్చెనె?' నా విని యామె నవ్వుచున్
బలికెను మెల్ల నా ప్రభువువచ్చె నటంచట నెల్లవారితోన్.

వ్యగ్రతగను వారు ప్రశ్నించి 'రతివరో!
యేడ నాతఁ డేడ నేడనంచు ?'
ఆమె బదులు పల్కె! నంతఃకరణమందు
నుండె నాతఁ డుండె నుండె నంచు. ౧౦

# ప రు స వే ది

(భక్తమాల)

బృందావనమున నది తట
మందునఁ గూర్చుండి మనము నందున భగవం
తుం దలఁచుచుండె గోకుల
చంద్రుండు సనాతనుండు సంయతమతియై.

అయ్యెడఁ బేదపాఱుఁ డొకఁ డల్లన వచ్చి నమస్కరింపఁగా
నెయ్యది యూరు? పేరుమఱేయెయ్యది?యంచుసనాతనుం డనెన్
జియ్యా! తముం గనుంగొనఁగ నేను చరింపని యూరు లేద యా
దయ్యము నెత్తికోలు తుదిదాఁకెను నేఁ డిఁక నేమి చెప్పుదున్.

వర్ధమానమంచు వఱలు మండలమందు
మానకరము సుండు మాదునూరు
పేరు జీవనుండు పేరుమాత్రమెకాని
జీవనంబె నాకుఁ జెలఁగఁబోదు.

నన్నుం బోలిన దీనుఁ డెందులను గానన్ రాఁడు చేలున్నవే
యన్నం బంటలు సున్న తొంటిగతిగా యజ్ఞాలు యాగాలు లే
వన్నాదమ్ములలోనఁ జుట్టములలో నత్యంతమున్ లేమిచే
నన్నన్నా తల యెత్తికోఁ దిరుగలే కల్లాడు చల్లాడుచున్. ౪

ఆరాధించితి నీశ్వరుం గలను నా కాతంపు కన్పట్టి నన్
బాఱంజూచి సనాతనుం గనుము తత్పాదంబులం బట్టు మా
ధీరుం దండ్రి విధంబుఁ గొల్వు మతఁడే తెల్పున్ ధనోపాయ మం
చారా యిచ్చెను దైవవాణి విఫలం బౌనా విచారింపుమా.

అనవిని యా సనాతనుఁ డహో కలలన్నియు నిక్కువంబులా
ధనమది దంధనంబనుచు దానిని ముంటిబలెం ద్యజించితిం
గనుఁగొనుమయ్యా నాకిచటఁ గల్గినభాగ్యము మల్లచిప్పసు
మ్మని తనచేతగామికి మహావ్యసనంబును జెందె నెంతయున్.

ఇటులు వగచి యాతఁ డించుక యోజించి
        మఱచినాఁడనయ్య మఱచినాఁడ
నీదుపల్కు చూడ నిక్కంబు దైవంబు
        కలను జెప్పుమాట కల్లగాదు.

ఈ యమునాతటంబునను నేనొకనాఁడు పదంబు లట్టిటుల్
వేయుచునుండఁగాఁ బరుసవేది కనంబడె దానిఁ దీయుచున్
దేయుఁ డెవండయేని చనుదెంచినచో నలవాని కిత్తునం
చీయెడ నేడనో విడిచియేఁగితి గుర్తది నాకు లేదెదన్.

అట్టిట్టు చూడుమయ్యా
యట్టడుగునఁ బడదు, దాని నంతగ ముట్టీ
ముట్టకమునుపే నీ యి
క్కట్టులు సకలములు పోవఁగలనని యనియెన్.

అనవుడు బ్రాహ్మణుండిసుకనంతయు దున్నియుఁ గెల్లగించియుఁ
బెనువడిఁ ద్రోసియుం బరుసవేదిని దీసెను దీయుచుండఁగాఁ
దన మనికట్టు తాయెతులు దానికిఁ దాఁకి సువర్ణరూపమై
కనఁబడె హస్తమెల్లయును గాంతులతోఁ బులకించె నెంతయున్.

ఆ విప్రుం డలవాలుకాతలమునం దాసీనుఁడై విస్మయం
బావిర్భూరగఁ జూచియాయమున యోహో యెంతయున్ విన్నచో
నేవార్తల్ వినిపింపబోదు! వినువాఁడే లేఁడుగా కంచెదన్
భావించెన్ రవి యస్తమించె యమునాపారప్రదేశంబునన్.

వెంటనె విప్రుఁడు లేచుచుఁ
గంటను బాష్పములు జాఱఁ గమలంబులతో
జంటయగు సాధుపదముల
నంటుచుఁ దానిట్టు లనియె నతిభక్తిమెయిన్.

ఏ ధనంబుచేత నెవ్వారు ధను లౌచు
మణిని మణి యటంచు మదినిఁ గొనరొ
ఆ ధనంబు కొంత యభిలషింతు నటంచు
నెత్తి యతఁడు మణిని నేట వైచె. ౧౩

# బం దా

వేణీబంధము మస్తకంబు పయినిం బెంపొంది లింగాకృతిన్
రాణింపన్, గురురాజ మంత్రమును నారాధించి బ్రాహ్మంబునన్
బాణిన్ ఖడ్గముఁ బూని క్షాత్రము నోగిం బాటించి, సిక్కుల్ నవ
ప్రాణంబుల్ ధరియించుచుండి రెలమిం బాంచాల దేశంబునన్.

గురునకు జయమంచు గురునకు జయమంచు
        నెన్నినాదంబులో మిన్ను ముట్టు
నిర్నిమేషంబులై నెగడు చూపుల వెన్ని
        యో చూచు నవ్య సూర్యోదయంబు
అక్కుప్రక్కల మోదమెక్కి ఝుంఝుణాయంచు
        నెన్ని ఖడ్గంబులో హేల మ్రోఁగు
'అలఖ' 'నిరంజనా' యను నెన్ని పిల్పులో
        పచరించుఁ బరభీతి భంజనంబు
అల్లపాంచాల మెల్ల నహర్నిశంబు
నాఁడు వాక్యంబు జోక్యంబు గూడుకొంచు
అలఖ యలఖ నిరంజనా యనెడు నొక్క
మ్రోఁత పెల్లిదమున నేకముఖత చెందె.

బ్రదుకుంజావులు పాదభృత్యు లనఁగా భావంబు కుంభాంతరా
స్పదమా దీపముగా స్వదేశమతియే భద్రంబు మంత్రంబుగాఁ
బద్ధునై తల్తలలాడు కత్తి చెలిగా భావింపఁగాఁ జేయు నొ
క్క దినం బొయ్యన వచ్చె నయ్యయిదువాఁకల్ గల్గు దేశంబునన్.

౨

అల్ల మహోత్తుంగంబగు
ఢిల్లినగరంపు దేవిడీలం దంద్రా
వల్లికలు తోఁగుచుండెను
నల్లల్లన ఫాదుషాహి యలసత బాసెన్.

సిక్కుల కంఠనాదములచే దివి కూయిడెఁ గత్తి మ్రోఁతచే
దిక్కులు మాఱుమ్రోఁగె బలుదివ్వెలచే దళమైన చీకటుల్
స్రుక్కఁ బ్రతిజ్ఞచేఁ దఱపి శోణిత మోడి యిలాతలంబు కెం
పెక్కఁగఁజేసె నార యయిదేఱులు పాఱుప్రదేశ మంతటన్.

తమతమదు గూండ్లనుండియుఁ దఱలిపోవఁ
దొంగి చూచుచున్న విహంగరీతి
లక్షలక్షల హృదయస్థలములనుండి
ప్రాణములు తొంగిచూచె నయ్యాదనునందు. ౬

వీరమద్దెలు వ్రేళ్ళకు వేసినారు
వీరగంధమ్ము ఱొమ్మునఁ బెట్టినారు
వీరతాయెత్తులను గట్టి వెడలినారు
సిక్కువీరులు వేగ నల్దిక్కులందు.

## 3

మొగలుల సిక్కువీరులయుఁ బోరది మిత్తి కవుంగిలింత బల్
పగ నిరువాఁగులుం గల బలంబుకొలందిఁ బరస్పరంబు ప
న్నగముల డేగలట్లు గళనాళముఁ గైకొని 'దీనుదీన'టం
చు 'గురునకుఙ్ జయంబ' యనుచున్ వెస నార్చిరి పెద్దపెట్టునన్.

తుదకు దురమున గురుదాసదుర్గమందు
కడిమి బందాను బందానుగా నొనర్చి
గొలుసులం గట్టి సింగంపుఁగోదమబలెను
బట్టుకొనిపోయె ఢిల్లికి వడి దురాణి.

బరిసెలమీఁద సిక్కుతలపాలల గ్రుచ్చి మొగల్ బలంబు ముం
దరఁ జన సిక్కు లార్నొకశతంబు పిఱుందన శృంఖలాధ్వనుల్
గురువునకున్ జయం బనెడి ఘోష కొగిన్ శ్రుతి పట్ట నేఁగి రం
దఱును గవాక్షమార్గముల దాఁగి కనుంగొనుచుండ నెంతయున్

ఎల్లరకు ముందు తమప్రాణ మిచ్చుటకును
నెల్లవారును ముందరకేఁగ వేగ
నుక్కువంబున నొండొండ త్రొక్కులాడి
వెనుకముందులు మఱిముందు వెనుకలైరి.

అరిపురమందు నీగతిగ నాదివసం బది దాఁటిపోయె న
ప్పరదివస ప్రభాతమున వచ్చిన ఘాతకుచేతి కత్తికిన్
శిరములు వంచి నాలుగురు సిక్కులు చిక్కులులేని వాక్కుతో
గురువునకున్ జయం బనుచు గొంతుక లిచ్చిరి వీతభీతులై

ఇట్టి చందముగను నేడు నాళులలోన
నేడు నూర్లమంది యెగిరిపోయి
రెనిమిదవ ప్రభాత మేతెంచె బందాకుఁ
గడుఁ బరీక్ష తెచ్చె కాజి వచ్చె.

బందాకొక్క కుమారుఁ డల్లపసుఁబాపన్ బద్ధబాహుద్వయున్
బందా కిచ్చుచు 'నీవె వీని వధియింపన్ పాదుషాయాజ్ఞ'యం
చందీయం గయికొంచు బాలుతలపై హస్తంబు నానించి యా
కందుం గాంచుచు నెర్రపాగకొన నాఘ్రాణించుచున్ వ్రేల్మిడిన్.

వేఁడికత్తిని మొలనుండి వెలికిఁ దీసి
బాలకుని మోముఁ దమ్మునిఁ బాఱఁజూచి
గురునకు జయం బనుచుఁ గర్ణకుహరమందుఁ
బల్కు 'నాతండ్రి! లేదురా భయము' టనియె. ౧౫

అభయకిరణంబు పసిమోమునందు నలరె
దండ్రిమోమును గాంచు చా దారకుండు
క్షీరకంఠంబుతో నిటుల్ కెరలి పలికె
'గురునకు జయంబ యెందు మాకు నభయంబ.'

వలపలి కేలc దత్క్షణమ వత్సగళంబును బూని తండ్రి దా
పలికయిc గత్తిచే బుడుతవక్షమునుం బొడిచెన్ బలంబుగా
బిలబిలమంచు నెత్తురులు పేరెమువాఱెను బాలకుం డనా
కులమతితోడుతన్ గురునకున్ జయవెట్టుచుc గూలె నేలపై.

ఘాతకుc డొక్క శూలమును గాలిచి కాలిచి తెచ్చి యల్ల బం
దాతనుసీమ గ్రుచ్చి బలితంబగు తూంట్ల నొనర్చుచుండcగా
నాతcడు పెక్కుపిట్ట లనయంబును దొల్చెడు పండురీతిగాc
జేతులొసంగి నిల్చె సభ చిత్తరువో యనc బొల్చె నెంతయున్.
౧౮

# శూరుఁడు

అల్లయౌరంగజేబు తానెల్ల భరత
ఖండమును ఖండఖండముల్ గాఁగఁజేయు
చున్నతఱిని యశోవంతుఁడన్న రాజు
పాదుషాదర్శనముచేసి పల్కెనిట్లు.

చీఁకటిలో రహస్యముగఁ జెంతలఁ బొంతలఁ బొల్చిపొల్చి య
స్తోక బలంబుచే నచల దుర్గమునన్ నహరా సిరోహినిన్
గైకొనె నాసిరోహి యిదె నాగృహమందున నుండె బందియై
మీ కల సింగపుంగొదమమీఁద దయోదయ మేమి తెల్పుఁడా!

అతనిమాట వించు నౌరంగజే బెంత
వింతమాట నేఁడు వింటి నయ్యా!
అశనిపూర్ణమైన యల్లమెఱుం గిన్ని
వర్షములకు మనకుఁ బట్టువడెనె?

కొండజాతివారిఁ గొన్ని వందలమంది
కూడఁ గొంచుఁ గొండగుట్టలందు
ఎండమావు లట్టు లుండెడు రాసుతుం
డెన్నినాళ్ళ కొదవె నెంతమాట? ౪

ఆతని వెంటనె కాంచఁగ
నాతురపడుచుండె హృదయ మచ్చోటునకున్
దూత యొకం డఱిముఱి సని
యాతని దో డ్తెచ్చుఁగాత మని వచియించెన్.

అంతటఁ బాదుషా పలుకు లారసి యంజలి యొగ్గి యా యశో
వంతుఁడు పల్కె నిట్టులు నృపాలక! సింగము నాగృహాంబు నా
కాగ్రింత మొనర్చె దానికి నగౌరవముం బొనరింప నంచు నో
క్కింత యనుగ్రహించు నెడ నేనె సరాసరి తెచ్చి చూపెదన్.

నవ్వి యౌరంగజే బెంత నవ్వుచేటు!
వీరుఁడవు నీవు; నీ నోట వెర్రిమాట
చూడ సిగ్గగు శూరుని శూరుఁడెందుఁ
జిన్నపుచ్చినఁ బెద్దలు చెల్లు నండ్రి?

నేఁ జెప్పుచుంటిఁగాదా
నేఁజెల్ల యొకింత వలదు నీకుం జింతా
బీజము సిరోహిశూరుని
రాఁ జూడుము వేగ రాజరాజా! యనియెన్. ౮

తల యెత్తికొంచు మునిముం
గలఁ గనుచు సిరోహిధరణికాంతుఁడు పెలుచన్
నిలిచె యశోవంతునితో
నలవోకం బాదుశాహి యాస్థానమునన్.

చేయుము సలాము చేయుము చేయుమంచు
సింహనాదంబు సభ్యులు చేయ నా సి
రోహినృపతి యశోవంతు బాహు వాని
'గురులకుంగాక యొరుల కే నెరఁగి యెఱుఁగ.'

అంచుఁ బల్కిన బాదుపా యనుచరుండు
జేఁగురించిన మోముతోఁ జెప్పె నిటులు
అవనిమీఁదను దలఁ బొరలాడఁజేయు
టెట్టులో నేర్చికొందు వొక్కింతలోనె.

నవ్వి చపల సిరోహిభూనాథుఁ డనియె
'ఇంతవఱకును నెఱుఁగ నే నెవరిభయము
భయముచే నెవ్వరికి నేని వందనంబు
చేయు టది యెన్నఁటికిని నాచేతఁగాదు. ౧౨

పలికి యిట్లు కత్తిపయి భారమును మోపి
నిలువఁబడియె శూరతిలక మతఁడు
పాదుశాహి మోదభరితుఁడై బాసటఁ
గూరుచుండఁ బెట్టుకొనియె, ననియె.

ధీరుఁడా ! నీకు భారతదేశమందు
నే ప్రదేశంబుమీఁదను నిష్టి కలదు ?
రాజు వాక్రుచ్చె 'నన్నిరాష్ట్రములకన్న
నచల దుర్గంబె స్వర్గంబుకన్న మిన్న.'

అల సభయందుల లోలో
పలఁ బరిహాసంబు చాలఁ బదనుగఁ బర్వెన్
బలికె నల పాదుషా యా
వల 'నచలుఁడ ! యచలదుర్గవర్తివె యగుమా !' ౧౫

# కోర్కికి మించిన దానము

అల సుహిద్గంజిలోన యుద్ధాంతమందు
అవని గడగడలాడంగ నల దురాని
సిక్కులం బట్టి సులతాను చెంత నిడియె
దూర్యనాదము దెసలూనఁ దురకసేన.

అపుడు తరుసింహునిం గాంచి యల నవాబు
'ఎల్లవారల మిము క్షమియింతునోయి'
యని యనియె నంత దరుసింహుఁ డనియె నిటులు
'ఇంత యవహేల మాపయి నేల భాయి!'

అంత నవాబు పల్కెనిటు లయ్యరె మీరు పరాక్రమక్రమా
క్రాంతులు నాకు మీపయిని గక్కస మింతయులేదు మీరు ని
శ్చింతగ నుండవచ్చుఁ దమ శీర్షములందలి జుట్టుకోసి మా
చెంతల నుంచి పొండిఁకను జివ్వలవేటికి మీకు మాకునున్.

అంతఁ దరుసింహుఁ డతనితో ననియె నిట్లు
తమకు మా మీఁద నెంతయో దయ దలిర్చె
వెండ్రుకలు మాత్రమే మీరు వేఁడినారు
తలలుఁ గూడను మే మీయఁ దలఁచినాము. ౪

# తీర్పు

(రాజస్థాన)

౧

'రేయిని ధర్మనాశ మొనరించు తలంపున నొక్క-దొంగ నా
జాయగృహంబు దూఱె నలచోరుని గట్టితి నిప్డు వానికిం
జేయఁగఁదగ్గ శిక్ష యెది? చెప్పఁడ'టంచును రత్నరాయభూ
నాయకుఁ జేరి ప్రార్థనను నాయము వేఁడె ద్విజుం డొకం డొగిన్.

'ధర్మసాగరమును మీరు తఱచినారు
మీ రెఱుంగని దున్నదే మేము చెప్ప
మరణదండము కంటెను మాఱు లేదు'
అంచుఁ దీర్పిచ్చె ఱేఁడు; బ్రాహ్మణుఁడు చనియె.

౨

ఒయ్యం బర్విడుకొంచు వచ్చి యొకబం టో రాజచూడామణీ
అయ్యయ్యో యలదొంగవాఁడు యువరాజండీ! ద్విజుం డీ నిశన్
గుయ్యాలింపక యంటఁగట్టె యిపుడే కోసెం దలన్ వీనినిం
జెయ్యం జెట్టయుఁ గట్టి తెచ్చితి నికన్ శిక్షన్ విధింపుం డనెన్.

అంత రత్నరాయఁ డా బంటునుం గాంచి
యించుకేని కదల కిట్టులనియె—'
మఱియు నేమియేని మాటాడఁగాఁబోకు
విడిచిపెట్టు విప్రు విడిచిపెట్టు.' ౪



# గురుగోవిందుఁడు

‘బందుగులార! క్రమ్మఱుఁడు వైళమ యిండ్లకు నాకు రాఁగ నిం
కం దఱి కాద గుట్ట లివి కన్నవి విన్నవి కావు కానలా
యందము లీను దాల యమునాపగ వేళ ప్రభాత’ మంచు గో
విందుఁడు లేపి చెప్పెఁ దనవెంటను బొల్చు కొలందిమందికిన్.

సాహసా పొమ్మిఁక రామదాసచనఁగా సన్నాహముం జేయుమా
లేహోరీ పదవోయి లోభకళికా లీలం దగం జూపి నన్
మోహావిష్టుని జేసి కర్మజలధిన్ ముంపంగఁ బోకుండు మీ
రోహో! జీవితరంగభూమి యిపుడెంతో దూరమం దుండుతన్.

నడిరేయిం బలుమానవాత్మలు ననున్ రమ్మన్నయట్టుల్ వినం
బడఁగా నిద్దురనుండి దద్దరిలి మేల్పాటొంది నే నియ్యెదే
వడిగా వచ్చితి వచ్చెవచ్చెననుచున్ వాకుఱిత్తు నిమ్మేని నీ
యెడఁదం బ్రాణముఁ ద్రోయ నెంతుమనుజాహీనప్రవాహంబునన్.

మిమ్ముల మీఁదు చాపలము మిక్కిలి గాంచిన నాయెడంద యు
గ్రమ్మయిపోవుఁ గోపశిఖ క్రాఁగి సహస్రశిఖాళిఁ గాలస
ర్పమ్మన నాటలాడుచును గ్రన్నన లేచును దీర్ఘకోశమ
ధ్యమ్మునఁ గత్తి తిట్టెడువిధమ్ము ఝణంఝణలాడు నెంతయున్.

ఈ గుహాను వీడి జయతూరి హేలఁ బూని
మానవులమధ్య దూఁకి సామ్రాజ్యములను
గొన్నిఁటినిఁ గూలఁ ద్రోసి యింకొన్ని నిలిపి
యొగ్గు బుగ్గిని గల్పు టదెంత సుఖమొ !

గుర్రమో యనఁ బరువెత్తు గ్రుడ్డినియతి
బట్టి కళ్లెమ్ము వెట్టి కైవసము సేసి
అడ్డమాఁకల కెదురొడ్డి యననుకూల
ఘటనలందేని నాదారిఁ గడఁపువాఁడ.

ఎదుటికి వచ్చునట్టి జన బృందమునం ద్రొక్క కొంద ఱోసరి
ల్లుదు రొక్కకొంద ఱుర్విఁ బడి లోఁగియు పోదురు బాధ తాద్విధా
భిదయగుఁ బాదచిహ్నములు వెన్కనె యాఁగును మింటికన్నొగిం
జెదరి చికాకుతోడ వెతఁజెందులయాగ్నులుగ్రకుక్రొంబొగన్.

ఏ యమారాత్రియో తుదిరేయి యగును
ఏ పవలో మెర్రినిప్పులమెండ కాయు
వజ్రగర్భిత మగు వారివాహసేన
విన్వీఁజిగి యెప్పుడో కాని వ్రీలిపడును.

‘ రా రం డం ’చును బిల్చుచుంటిని మహారంభంబుకై యెల్లరన్
వారుం బర్విడివచ్చుచుండి రఖిలద్వారమ్ములున్ శూన్యమౌ
వీరున్ వారన కెల్లవా రవశులై విచ్చేయువా రింక నే
దారిం జూడఁగ సౌఖ్యదుఃఖముల బంధం బుండఁబోదింతయున్.

ఈలలి నాదుపిల్పు విని యెవ్వరి నెవ్వ రొకింత నాపఁగాఁ
జాలర యైదువాఁకలును సంద్రమునం బడితీరునట్లు భ
క్తాళిమనంబు లన్నియు మదైక్యము చెందఁగ వచ్చితీరుఁ బాం
చాల మిదెల్ల నొక్కపరి చాల హాలాహాళి గింగురించెడిన్.

భీరువులార! నే నెటకు వెళ్లుదు? నా పిలు పీఱ మీఱుముం
దూఱుఁ బ్రభాతమందులనె తోడనె రం డను నాదుపిల్పు వి
న్నారయి పాటు మానుచు జనంబులు వత్తురు రాత్రియందునన్
రారె యటన్న పిల్పు చెవి రాయఁగ నిద్దుర వోరు చూడుఁడా!

ఏ నిటు ముందుముందులకు నేఁగు కొలందియు బాటపేట లా
స్థానములున్ నరాటవిగఁ దార్కొను జాత్యభిమానముల్ లయం
బౌను ద్విజుండు మాలఁడొకఁడై చను మానముమానహానియున్
హానము చెందు హేలగను బ్రాణము లిచ్చెద రెల్లవారొగిన్.

చాలుంజాలును నీకల
యేలా? కా దిపుడు సమయ మీ దీర్ఘనిశన్
మేలుకని యరుణుఁ జూడఁగ
గాలం బెడలింతు నొంటి క్షణగణనమునన్.

ఇప్పుడు కల్పనాజగతి నింక నరణ్యమె రాజధాని తా
నిప్పటి కింక భావనయు నెంతయు మూకమె యింక సాధనల్
చప్పఁగఁ గర్మముల్ విడిచి శాంతమనస్స్థితితోడ రేఁబవల్
తప్పక యాత్మనుండి గళితంబగు వాణిని నాలకించుటల్. ౧౮

కావున నొంటిగా యమునకట్టలయందులఁ గొండలందులం
గ్రోవులయందులం దిరిగి కొండల క్రోడములం బెరుంగుచున్
పావనమైన నిర్ఝరుల పాటలతోడుతఁ బాటఁ గల్పుచున్
నావిధి నేనొనర్చుచు మనంబునఁ బొందుచునుంటి శక్తినిన్.

ఇక్కరణిన్ గతించెఁ బదియేఁడులపై నొకరెం డిఁకెన్ని పోఁ
జిక్కునొ చిక్కఁగా కమరజీవిత మొక్కొక చుక్కగాఁగ నల్
దిక్కులనుండి నేరుపుగఁ దెచ్చి పదంపడి యంతరాత్మలో
మొక్కలువోక నేను పరిపూర్ణతగాంచు దినం బదెన్నఁడో !

గురువు మీయందఱఁ గోరుచునున్నాఁడు
నావెంట నెల్లరు నడవుఁ డంచు
నా జీవనమునందు నవజీవనము నొంది
యెల్లదేశము జాగరిల్లు నంచు
నిక్కమౌ వస్తువు నే నిందు నందుకొ
న్నాఁడను దారిఁ గన్నాఁడ నంచు
ఇంక భయంబులే దింక సంశయము లే
దింకేమియును లేదు వంకయంచు
చావు బ్రతుకులు లోనైన వేవి లేవు
ఎల్లలోకము లట నోసరిల్లు నంచు
అమ్మ ! నా పని నేఁటికి నాయె నంచు
నెప్పుడీ ప్రాణములు విప్పి చెప్పఁగలనొ ! ౧౭

చేతంబందున దైవవాణి యొకో మ్రోసెం జూడుఁడీ యిట్టులన్
"నీ తేజంబున నీవు నిల్వఁబడుమీ నీ ముంగలం గాంచుమీ
నీ తాత్పర్యము వీనులార వినఁగా నీ యాన చెల్లింపఁగాఁ
న్ భక్తిని నెండ తెంద తీదె యార్తిన్ వచ్చుచున్నారలో!

" వినుము విను మవె కలకల ధ్వనులు! హృదయ
ధార పరుగెత్తు; నీవు మాత్రమ్ము దివ్వె
కరణి మేల్కాంచి యుండుమీ! కానినాఁడు
వారలీ నిసిఁ బోదురు వచ్చుదారి. "

వెలలుమ రామదాస! యిఁక వెళ్ళుమ సామువ! మిత్రులార మీర్
వెలలుఁ డిఁ కెల్లవా రటులు వెళ్ళుఁడు ముందొకసారి రం డిటుల్
కొలకొల మంచునన్ గురునకున్ జయవెట్టుఁడు చేతులెత్తి మీ
రలఖ నిరంజనా యనుచు నార్వుఁడు చాలును విందు నెంతయున్.

# శేషపాఠము

## ౧

సిక్కులకు నొజ్జ గోవిందుఁ డొక్కనాఁడు
ఒక్కయేకాంతమగు చోట నొక్కరుండు
కూరుచుండి విచారించుకొనుచునుండె
నాత్మజీవనచరితంబు నాదినుండి.

యౌవన మన్న శుభ్రపటమందుల నే రుచిరాక్షరావళుల్
పూవులువోలెఁ గన్పడెనొ ము న్నొకపట్టున భారతీయ మా
భూవలయంబు నే తలఁపు ముట్టి గ్రసించెనొ యవ్వి నేఁడు తా
మావిలమై దురాశయయి యాతనికిన్ మదిదోఁచె నెంతయున్.

ఇది యెల్లఁ బెద్ద కలయా!
తదుపరి యీ జీవితంబు తా వితయా! యం
చెదఁ దలఁచి తలఁచి కలఁకం
జదికిలఁబడి కూరుచున్న సంధ్యావేళన్.

అరుదెంచి యొకతురుష్కుం
డరుగుచునున్నాఁడ దేశ మయ్యా మీ య
క్కఱ కొఱకుఁ గొన్న గుర్రపు
ఖరీదు నొసఁగుం డటంచుఁ గథియించె వెసన్.

గురుగోవిందుఁడు మోము నెత్తుచును 'షేకూ! నీకిదే నాసలాం
తురగంపున్ వెల తెల్ల వాఱఁగనె యిత్తున్ భాయి పోవోయి యి
త్తఱినంచున్ వచియింప షేకు 'మరియాదా నీకు? నాసొమ్ము తె
మ్మురదొంగా గజదొంగదొంగయనుచున్ ముమ్మాఱునిందించినన్

విని చరాలున గురువు గోవిందుఁ డంత
మెఱుపువడితోడఁ గత్తిపైఁ గరము వైచె
షేకు తల యొక్క త్రుటిలోన ఛిన్నమాయె
దురకనెత్తుట నల నేల తోఁగియాడె.

గురుగోవిందుఁడు దాఁటిపోయిన పనిన్ గుర్తించి 'నా కింతతో
సరి యీపాపపుఁ గత్తి రిత్తగను నస్రిం బోడ్చి లక్ష్యంబు నే
మరె నీబాహువు నమ్మ నింక మఱి నామర్యాద చేదాఁటె ముం
దర నీ పాపములంబునుం గడుగుటే నా యంత్యకర్మం బాగిన్'

అని తలఁచె నల్లతురకకుఁ
దనయుఁడు పసికాయ యొకఁడు తనరారఁగ నా
తనినిన్ మచ్చిక చేయుచుఁ
దనకడనే యుంచుకొనుచుఁ దాఁ బోషించెన్. ౮

కన్న కుమారులకన్న మిక్కుటముగాఁ
జన విచ్చి మనసిచ్చి చాల సాకె
మిత్రుని సుతుకన్న మేలుతరంబుగా
నాతనితోఁ గూడి యాటలాడె
కూఁతు నిచ్చిన యల్లుఁగుర్రకు దొడ్డగా
నన్నవస్త్రము లిచ్చి యాదరించె
నమ్ము శిష్యునికన్న నాడెంబుగాఁ గంట
వత్తిడుకొని విద్య యొత్తిచెప్పె
ఇట్టి గురువును శిష్యులు చుట్టు ముట్టి
'దేవరా! మీకు మే ముపదేశ మొసఁగు
వారలము కాము యది గుడ్డు వచ్చి పిల్ల
వెక్కిరించుట యగుఁ గాని వినుఁడు మమ్ము.

పులిపిల్ల నెంత పెంచిన
నల జాతిగుణంబు మానునా? పెరిఁగినచో
నలదాని గోళ్లు మనమా
టలు నుంతేనియును వినుట టాటోటు సుఁడీ!

అని హెచ్చరింప నంతట
నని మెను గోవిందుఁ డిట్టు లహాహా! పులి పి
ల్లను బెబ్బులిగాఁ జేయక
కనుఁడీ యేమిగను మప్పఁగలుగుదు నింకన్. ౧౧

చూచుచుఁ జూచుచుండ గురుచూపున బాలుఁడు పెద్దయై కుమా
రోచితలీల నాతనికి నూడిగముం బొనరించి మించు, డా
చే చెలువంబుగా సతము చెంతనె నిల్చును, దోడ నీడగాఁ
దోఁచి చరించుఁ బ్రాణములతో సరిగా వలచున్ గురూత్తమున్.

సమరమునయందుఁ గొడుకులు చాలమంది
చెల్లి గురుమది శూన్యమ్ము చేసిపోయి
రిపుడు పెత్తనమందున నీ తురుష్క
నందనుఁడు దానిఁ దా నశూన్యంబు చేసె.

వాయు బలమువల్ల బయలునయందుండి
కొట్టుకొంచు వచ్చి క్రొత్త విత్తు
రిత్త తొర్రి జెంది రేకెత్తి కొమ్మల
వృద్ధవటము నావరించుఁ గాదె.

ఒకదిన మాపఠాను తనయొజ్జకు సాగిలి మ్రొక్కి మీ దయన్
సకలము నేర్చికొంటిఁ దమసమ్మతియేనిని బోయి రాజ సై
నికులను జేరి నే బ్రతుక నేర్చెదనం చన వీఁపు తట్టి నీ
కిఁకను బరాక్రమంబునను నించుక లోటనియెన్ గురుం డొగిన్.

## 3

పరదిన సాంధ్యవేళ గురువర్యుఁడు తా నసివారు వోవుచున్
దురకను బిల్చి వాడి యసితోఁ నిటు రమ్మనె భక్తు లెల్ల ర
గ్గురువరుఁ డొంటిగాఁ దురకకుర్రనితోఁ జనుచో నభద్ర మం
చరయుచు మేము వత్తు మని యార్చిరి వద్దని దేశికుం డనెన్.

గురువరుఁడు శిష్యవర్యుం
డిరువురు మౌనంబుతోడ నేకాంతమునన్
జరజర నడచుచు నడచుచుఁ
దటిసిరి యొక పెద్దయేటి తట మల్లంతన్.

రాలు విరఁజిమ్మఁబడియుండు కూలమునకు
వానకారున జలధార పాఱు తెంచి
క్రేళ్లు దాఁటుచు వేలాది వ్రేళ్ల చేతఁ
గోసగా నెర్రమట్టిని గోఁకివైచె.

అందుగుల బారు లందము
చిందుచు నొప్పారె లేఁత చిగురుంబాపల్
క్రిందుకొని యంబరాంశం
బందుకొనం బోలెఁ ద్రోపు లాడుచునుండెన్. ౧౯

లక్క జేగురు రం గొప్పు నొక్కయోర
వాలుకాతీరమందు మోఁకాలిబంటి
నీరు స్ఫటికంపుఁ దెలుపుతోఁ బాఱుచుండె
గురువు నదియాలఁ జూపె నా తురక చూచె.

ఆఱిపోవు దినాంత దగ్ధారుణాభ
పొడవు ఛాయలతోఁ గూడి పడమటగను
గబ్బిలంబుల విచ్చు రెక్కల విధాన
నెగిరిపోయెను నిశ్శబ్దమగు నభమున.

గోవిందుం డప్డు డాపతానునిఁ గనుంగొంచోయి మామూద! యీ
తావుం జూడుము త్రవ్వు మీడ నని హస్తం బెత్తి చూపింపఁగా
నా వాఁ డయ్యెడ నున్న పెల్లిసుము పాయంజేయుచున్ గర్తముం
గావించెన్ వెసఁ గానిపించెను శిలాఖండం బొకం డెఱ్ఱగన్.

'రాతిని జూచితే యెఱుపురం గిది నీ పితృశోణితంబు నే
నాతని కీక డబ్బు, సమయంబు నొసంగక, త్రుంచితిం దలన్
హేతిని బట్టుమీ యిఁకను నీవు సుపుత్రుఁడ వేనిఁ బ్రేతకుం
బ్రీతి యొనర్పు మీ తఱి నోరీ పితృఘాతకు రక్తధారలన్'.

ఇటులు పలికిన గురువుపై కెగిరి దుమికి
జబ్బ పైకెత్తె మామూదు బెబ్బులివలె
అల్ల గురు వెట్లు నిలిచెనో యటులె నిలిచె
నతికఠోరంపుఁ బ్రస్తరప్రతిమవోలె. ౨౮

తత్క్షణం బతండు తరవారి నేలపైఁ
బాఱవైచి గురువు పదములందు
మోఁకఱిల్లి తాము ముందింక సైతాను
తోడఁ గూడి యాట లాడవలదు.

గురువంచుఁ దండ్రి యంచున్
మఱియుం జుట్టం బటంచు మఱి దైవమటం
చరసితి మిమ్మే, ధర్మం
బెఱుఁగుచు మా తండ్రిమాట నేమరితి నిఁకన్.

మానసమందు నాకు నల మంగళభక్తియె నిల్చుఁగాక యీ
హీనపు హింస యాత్మ మొలకెత్తక మాసియపోవుఁగాక దే
వా! నిజపాదధూళి యిదుఁ డంచును బల్కి బిరాన రోఁజుచుం
గానను దాఁటె వెన్దిరిగి కాంచక యాఁగక యించుకేనియున్

రెండు నీటిబొట్లు పిండిన యట్టుల
నురలి గురువు నేత్రయుగము తడిసె
నాఁటినుండి క్రొత్తబాటగా మామూదు
అయ్యె దవ్వుదవ్వులందె యుండె.

నిర్జనంబగు నింట నిద్రించు నోజ్జను
తెలవాఱు తఱి మేలుకొలుపఁ జనఁడు
నిద్రాగ్రహముముందు నిస్త్రింశహస్తుఁడై
రాతిరివేళఁ బారాకు రాఁడు

ఏకాంతసీమల కెందేని దేశికుం
డే పిల్చినను వెంట నేఁగఁబోఁడు
ఒజ్జతోడుత నేటియొడ్డులఁ గానల
వేఁటాడఁ బోవంగ వెడలిరాఁడు
శిష్యుఁ డీరీతి నుండ దేశికుఁడు చూచి
యొకటఁ జదరంగమున దింపె నుభయు లపుడు
పొద్దుపోక లెఱుంగ రా పొద్దు శిష్యుఁ
డోడెఁ బ్రతియాట కంపంబు గూడె మాట.

సంజ వచ్చెను జీఁకటుల్ చాల హెచ్చె
రేయి ముదిరెను పై వారు పోయి రంత
తలఁపు తీక్ష్ణమ్ముఁ గావించి తలను వంచి
బలము చూచుచునుండె నా మలకబిడ్డ.

అల గురు వెష్డొకాని బల మంతయునున్ విరఁజిమ్మి మల్కా పెం
దలపయి రివ్వునం బొడిచి నవ్వుచుఁ "దండ్రిని జంపువానితోఁ
గలియుచు నాటలాడుకొను కాపురుషుండవు రోరి యిట్టి వా
రలకును నెందులన్ జయము రమ్మనవచ్చునె?" యంచుఁ బల్కెనన్

వెంటనె మెఱుపుం బోలెం
గంటికిఁ గనిపట్టు వాడి ఖడ్గంబు పటా
నంటెనొ లేదో గురునెద
గంటున రక్తంబు ధారగట్టెన్ నేలన్. ౩౨

అప్పుడు దేశికుండు దరహాసము సేయుచుఁ బల్కె నిట్టులన్!
దప్పునకుం బ్రతిక్రియ యొనర్చుట యెట్టులో యద్ది నేఁటికిం
జెప్పితి శేషపాఠమును జెప్పి సమాప్తము చేసివైచియే
యిప్పుడు పోదుఁ దండ్రి! కొనుమీ తుదిదీవన లే నొసంగితిన్.
33



# న క లు ఖి ల్లా

( రాజస్థాన )

౧

పుడమి నెంతవట్టు బూందిదుర్గం బది
యలరుచుండఁగలదొ యంతవట్టు
నీరు త్రావ నని చితూరుమహారాజు
పట్టుపట్టెఁ జాల భయముపుట్టె.

ప్రెగ్గడ లీ పంతము విని
'లగ్గే? దుష్కరము మనుజులకు నిది యెట్టుల్
నెగ్గు?' ననిరి నృపుఁ డీయది
నెగ్గనిచోఁ బంత మింక నెగ్గింతు ననెన్.

అలరున్ మూఁడగు యోజనంబుల యెడంబౌ బూంది దుర్గం బటం
గల హారాకులజాతు లెల్లరుఁ బరాక్రాంతిం బురారాతులో!
పులులో! హా మున్నృపుండు మొగ్గరమునం బొల్వం బరుం డెవ్వఁడున్
గలలం దేని వణంకు, దానికిఁ బ్రమాణం బీ చితూర్ భూపుఁడే. ౩

ఆలోచించి రుపాయమ్మున్ సచివు లిట్లా బూందిదుర్గంబునుం
బోలెన్ దుర్గముఁ గట్టి దానిని జితూర్ భూపాలుచే నెంతయున్
గాలన్ గేలను గూలఁజేయవలయుంగా కట్లు గాకున్నచో
హేలాలాపమునోస మాత్మవధ కాదే త్రేని కీ రోజునన్.

అను చమాత్యులు తలపోసి యుల్ల రేయి
శిల్పులం బిల్చి వారలచేత నపుడు
బూందికోటకు నకలుగా బొమ్మరిల్లు
కట్టఁజేసిరి చిత్తూరు నట్టనడుమ.

## ౨

హారాకుల సంజాతుఁడు
వీరుఁడు కుంభుం డనంగ భృత్యుం డల చి
త్తూరు ధరాదారుని కడ
గారవముగ నుండెఁ జాలఁ గాలమ్ముబడిన్.

వీరుం డాతఁడు వేఁటవోయి యపుడే వీతెంచు చీ వార్త పల్
మాఱుల్ వించు నెవండురా నకలు ఖిల్లా నేలనుం గూల్చి మా
హారావంశ్యులనే యధోముఖులఁ జేయంజూచురా? నే నిదే
పారా యిచ్చెద మచ్చుకోట కనుచుం బైనుండె వీక్షించుచున్.

మచ్చుకోటను బల్లున మట్టి గలుప
వచ్చి రప్పుడు చిత్తూరు ప్రభువుగారు
ఉండు మావల నావల నుండుమంచు
బిట్టు గర్జించి కుంభుండు పిడుగువోలె.

'బూందిపేరను నాటాడఁ బూనినావె?
అవ్వ! సైరింపఁజాల నీ నవ్వులాట
బూందికోట ప్రాకారంబు ముట్టనీయ
నో మహారాజ! దవ్వుగా నుండవయ్య.'

అని మోఁకాలిని నేల కాన్చుచును విల్లంబుల్ కయిం బూని ని
ల్చిన కుంభున్ గిఱివేసి వాడియసిచే సేనల్ తలం ద్రుంచి పై
చిన వేగం బడె వాని మస్తకము పైన్ సింగంపు మోసాల, న
ల్లనఁ దద్రక్తముచేత నా నకలుఖిల్లా ధన్య మాయెం దుదిన్.
౧౦

# హోలీ మహోత్సవము

(రాజస్థాన)

ప్రేఁగగు నాజి నోడి కడు వింతల కగ్గములైన దుర్గ భూ
భాగము లుక్కుకోటలును వైభవముల్ విడనాడి పోయి భూ
నాగుని రాణి కేతనము నాఁదగు పత్తనమందు నుండి యా
లాగున వ్రాసెఁ జీటి పదిలంబుగఁ గేసరఖాను జేనికిన్.

మియ్యా మీకు లడాయిమోజుచనెనేమీ? యీవసంతంబు తాఁ
జయ్యం బోవుఁ బఠాను సైనికులతోఁ జన్ దెమ్ము రాట్పుత్రికల్
వెయ్యాల్యుర్ గల రిందు నందఱము హోలీక్రీడ కావింత మం
చొయ్యం గేసరఖానుచీటిఁగని 'యోహోయాడునేయుం' చొగిన్.

పలుమఱు చూచెఁ జూచి పయిఁబైకిసి గడ్డము దువ్వె దువ్వి పెం
దలపయి నెర్రపాగ నొకదారిగ దిద్దెను దిద్ది యత్తరుల్
చిలికిన చేరుమాలు వడిఁ జేకొనెఁ జేకొని రెప్పలందుఁ బే
ర్గల సురమాయి రాచె, మఱిరాచి మఱిమ్మఱి దువ్వె గడ్డముల్.

వకుళవనంబునన్ మలయవాయువు మత్తిలిపోయె మావులన్
ముకుళము లెత్తెఁ దుమ్మెదల మొత్తములెవ్వరిమాటలన్ వినున్?
సుకముగ నెల్ల దిక్కులను జుమ్మని స్వేచ్ఛగఁ గ్రుమ్మరిల్లెఁ దా
మొక రొకరే పఠాను లలయుత్సవముం గనవచ్చి రెంతయున్. ౪

## ౨

కేతునపత్తనోపవనికిన్ మలుసంజ యమర్చు రాగవి
ఖ్యాతికిఁ బిల్లఁగ్రోవి యనఁగాఁదొడఁగెన్ ములతాను రాగమున్
బ్రాఁతిగ రాణిదాసికలు రాజితవేషలు నూఱుమంది తా
మాతఱి వచ్చి రెర్రఁబడె నంతట వేఁడివెలుంగు నింగినిన్.

ముంగాళ్ళతో నేమొ ముచ్చటింపంబోయి
పల్చని గాగరా పైకి నెగుర
పైఠిణీరైకపైఁబడు దంటపయ్యంట
ఱొలయు గాలికి నిద్రనుండి లేవ
వలకేలను గులాబిగలఁతి డాకేల బు
క్కాయి కోరయుఁ బూంగి కాలుదువ్వ
చిఱుపోకముడినుండి చిమ్మ్రనంగ్రోవి యొ
య్యారంపు ఠీవి వ్రేలాడుచుండ
తగఁ బఠానులతో వసంతంబులాడు
తలఁపు మిగులంగ రాజపుతాను వారు
బారుబారులు గాఁగను వచ్చిరెలమి
కేతునపురాణి సకియ లా కెలని కపుడు.

కన్నులనవ్వి చాల దరిగాఁ జని కేసరఖాను వల్కె ‘నే
నెన్నొ దురంబులన్ బ్రతికి యేడ్తెఱ వచ్చితి నీ దురంబునం
దెన్న నెఱింగియే యెఱిఁగియే మరణించెద’ నాఁగ విన్న యో
షిన్నికరంబు నవ్వెఁ గని చేసె సలాం మతఁ డోరపాగతోన్.

నవ వసంతోత్సవోన్మాద మంతకునంత
    కధిక మత్యధిక మభ్యధికమాయె
మాపటి యాకాశ మంటపంబునయందు
    బుక్కాగులాములు పోసి రెవరో
వకుళ వృక్షములందు వాసించు పూలలో
    నొక క్రొత్తరంగు తా నుదయమాయె
అఖిలవృక్షంబుల యాలవాలములందు
    రక్తపరాగంబు రాలి పడియె

ఒయ్య రాజపుతానాంగనోపహాస
ములకు నులుకుచుఁ బిట్టలు పలుకుమఱచె
ఏడనుండియొ యెర్రని మూడమంచు
పట్టె మాపటిమిన్నుల పట్టునందు. ౮

## ౪

ఈ వామానయనంబులందుల నిషా యింతేని లే డేలొకో!
యీవక్షంబులు నున్నతంబులును గావేలొక్కొ యీయందె లే
లా వైస్వర్యము? జిమ్ముగాఁ గంకణము లేలా శ్రవ్యముల్ గావటం
చావేగంబును నక్కజంబు నుభయం బా ఖాను చెందె న్మదిన్.

పలుకులా కోయిలపలుకులు కావు వ
 ర్షాకాల మేఘగర్జనలు గాని
పదములా నడచెడు పద్మముల్ కా వగ్గి
 చెరిగెడు రవికాంత శిలలుగాని
కరములా తామరకాడలు కావు భీ
 షణమైన కాలపాశములుగాని
దేహమా పూచిన దివ్యవల్లరి కాదు
 సళువైన కఠినకాష్ఠంబుగాని
మంజరీహీన మరుభూమి మహితలతలు
వీర రాజపుతానా మహాయువతులు
చూపునం జేత నెదను నాజూకు లేదు
అంచుఁ గేసరఖాను తా నాత్మ నెంచు. ౧౦

౫

ద్రుతతాళమ్మున గలిన
మ్మతిఁ బిల్లంగ్రోవి తా నిమర్న్ భూపాలిన్
జతురతర తానముం గొని
ప్రీతి లేకుండంగ నపుడు పాడఁ దొడంగెన్.

కుండలంబుల ముత్తియంబుల కుచ్చుదండ ల వూఁగఁగా
రెండుచేతులఁ గంకణంబులు రెండు మోటుగఁ బొల్వఁగా
దండ దాసి వసంత ముంచిన దండి గిండియ దేరఁగాఁ
జండి చందము రాణి యప్పుడు సాగి వచ్చెను గ్రిచ్చఱన్.

పలికెఁ గేసరఖాను—‘నీ దారిఁ జూచి-
చూచి కన్నులు రెండును సొట్టలాయె’
పలికె రాణియు—‘మాకు మీవంటిదశయె’
నాఁగ నూర్వురు చెలియలు నవ్వి రంత.

వదఁపడిఁ జరాలునన్ ఖాను నుదుటిమీఁద
రాణి చేకంచుఁగన్నె బిరానఁ దాఁకె
తా ననినయట్లు కేసరఖాను రెండు
కన్నులును బొత్తలాయె రక్తంబు కాఱె. ౧౮

## ౬

క్రాలెను మింటఁ జంద్రుఁ డధికంబుగఁ జెట్టులఁ జెట్టులన్ నగా
రాలు మొగిళ్లులే కుఱుము రాణగ మ్రోఁగెఁ గరాసి భాసురా
భాలహారుల్ తళత్తళలఁ బర్వె సనాయి గభీర సుస్వరాం
దోళిత మాచుఁ గన్నడను దోడనె పాడఁ దొడంగె వాకిటన్.

గాలికి గాగరాలు మఱి కంచెలతోడి పయంట లన్నియున్
వ్రీలెను నేరొ మంత్రములు పెట్టినటుల్ మగవేసముల్ కదన్
గ్రాలెను నందు నాలుగు రఖంబులు పూవులనుండి త్రాఁచులం
బోలెను లేచి చుట్టుకొని ముట్టిరి బిట్టు పఠానువారినిన్

వచ్చిన దారిఁ బట్టుకొని పాఱిరి వేగఁ బఠానువార లా
పచ్చి వసంతరాత్రిఁ దెలవాఱులు కోకిలకూజితాలకుం
గ్రిచ్చఱఁ దోఁటలన్ విధివిరామము లేదిటువోలె సాంగమై
వచ్చెను గేతునాఖ్యపురిఁ బండుగ కేసరఖాను జేనికిన్. ౧౭

# పెండ్లి

( రాజస్థాన )

ఆయెను రేయియందు నొక యామముమాత్రము మేలితాయి న
న్నాయి వినంగఁబట్టె నయనంబులువ్రాలఁగఁ గొంగుము ల్లోగిన్
రాయ వధూవరుల్ బొమలరాణఁ జెలంగిరి మేల్ముసుం గెడం
జేయుచు గూండ్లనుండి పురిచెల్వాలు చూచుచునుండి రాదటన్.

తొలకరిమబ్బు పెల్లుఱుముతోడుత మంగళ శంఖనాదముల్
కలగొనెఁ, దోలితోలి చలిగాలి చటుక్కున నీశు దిక్కునన్
నిలఁబడెఁ, గాఱుమబ్బుగమి నింగినిఁ గప్పెను బెండ్లిపందిరిం
గల మణిదీపకాంతులకుఁ గన్ను లొగిన్ మిఱుమిట్లు గ్రక్కొనెన్.

## ౨

'మంటపమధ్యసీమకు నమాంతము వచ్చెను వీఁ డెవండు? మి
న్నంటుచు భేరిమ్రోఁతవిన నాయెను మోసలయందు 'నంచు వె
న్వెంటనె యెల్లవార లల పెండ్లికుమారునిఁ బెండ్లికూఁతునుం
బంటపాలానకున్ వెలుగు వైఖరిగా గిటివైచి రాదృతిన్. 3

బాసికంబుతోడఁ బసుపుబట్టలతోడ
మలయు మేత్రిరాట్కుమారునకును
మనవిచేసె నిట్లు మార్వారుభూపాలు
దూత హస్తములను దోయిలించి.

'రణము పొసఁగె నేఁ డరాతిసైన్యంబుతో
రామసింహుఁ డేఁగె రణము వెంట
పఱచిరందు వీరు పసిపిల్లబాలాది
చెందుఁగాక రామసింగు జయము'

అనవుడు 'రామసింహునకు నౌత జయం'బని మేత్రిరాజు బి
గ్గన ననెఁ బెండ్లివారలును 'గాత జయం బల రామసింహరా
జున' కని యార్చిరా వధువు సొమ్మసిలెన్ బెగడొంది దూత యి
ట్లనియెను 'మేత్రిరాణ్కొమరుఁడా యిఁకఁ గాలము లేదు సుంతయున్'.

వెడ వెడఁ జేలకొంగుముడి విప్పి వరుండు వధూముఖంబు చూ
చుడు వధువుర్ వరుంగనియెఁ, జూచువరుం డనె—'నాకుఁ బోవనౌ
ప్పెడు తఱి యాయె మృత్యుసభ పిల్పరుదెంచె సనాయి డోలులుం
దుడుములు తప్పెటల్ మఱియు దుందుభులావజముల్ వితావితల్.

వీరుఁడు తా నిటుల్ పలికి పెండ్లికిరీటము పెండ్లి బొట్టుతోఁ
బేరెము దీసెఁ దేజిపయిఁ బెండ్లికొమార్త కదుర్ నతాస్యయై
చేరెను రాణివాసమును జెచ్చెరఁ బెండిలి మంటపంబునం
దాఱెను దీపముల్ నృపసభాంతరమందు నెసంగెఁ జీఁకటుల్. చా

వగచుచుఁ దల్లి దుఃఖభయభారమునన్ "దురదృష్టురాల! యీ
నిగనిగ పెండ్లివేసమును నీఁగుము" నా విని కన్య "యమ్మ! నా
మగని గృహాన కేఁగెదను మంగళవేషముతో" నటన్నఁ దా
మొగమును మొత్తుకొంచు 'సరిపో'మ్మనెఁ దల్లియు మెల్ల మెల్లగన్

అంతటఁ గన్యమీఁదను గ్రీహాంబు లెఱింగిన పాఱు లెల్ల న
క్షింతలు వేసి రా వధువు చెచ్చెరఁ బల్లకి నెక్కె వీటిలోఁ
గాంతలు కంట నీ రిడిరి క్రిన్నన బంటులు బైలుదేఱి ర
ల్లంతనఁ దల్లి ముద్దిడియె హస్తము పై నిడెఁ దండ్రి మెల్లగన్.

ఈ నడిరేయి యందులను నెవ్వరు మీరు? సనాయిపాటలన్
మానుఁడు! పల్లకిన్ భువి నమర్పుఁడు! మేతిరినృపుండు పోరునం
బ్రాణము లీఁగె నీ యసమయంబున మీ రెవరమ్మ? మేము భూ
జాని చితాప్రయత్నమును సల్పుదు మం'చని రెల్ల రచ్చోటన్.

'పాడుఁడు పాడుఁడో'రి'యని పల్లకినుండియుఁ బెండ్లికూఁతు మా
టాడుచుఁ 'బెండ్లి యింక నది యంతము కాదు చితాసభాగ్నిలో
నేఁ డిదె శేషహోమమును నేనెఱవేర్చెద' నంచుఁ బల్కుచుం
'బాడుఁడు పాడుఁ డో'రి'యని పల్లకినుండియుఁ బెండ్లికూఁత నెన్.

చితపయిఁ దారహారములఁ జెల్వగు పెండిలివేస మొప్ప భూ
పతి శయనించెఁ దద్రుధిరవస్త్రమునం దనకొంగు గట్టి రాట్
సుత చితపైకి జాఱి వరుఁ జూచుచు నాతని శీర్షముం బతి
వ్రత తొడఁ దాల్చె మేత్రిపురరామలు వచ్చుచుఁ జూచుచుండఁగన్

'వాసికి నెక్కె తొల్ల మృతిఁ బట్టి పలార్చితి వంచు బట్లు 'ధ
న్యాసి పతివ్రతాసి విమలాసి' యటంచని యప్పురోహితుల్
నేసలు చల్లి రగ్ని విరఁజిమ్మెను మంటల, నచ్చితాగ్ని యో
గాసనముండె నావధు వహో యని యార్చిరి తత్పురాంగనల్.

౧౪

## ప్రాడ్వివాకుఁడు *

పాశ్చాత్త్యంబున వన్నెకెక్కు నల పీష్వాలందుఁ బేరుగొన్న భూమీశుండా రఘునాథరావనియె 'నే నీ భూమిభారంబునన్ నాశంబుం బొనరించెదన్ హరుని చందానన్ మహీశూర దేశేశానుండగు హైదరాలి పొగ రెంతే దించెదన్' నావుడున్.

అల దళపతి యాజ్ఞను ముం
గల నెనిమిదివేల బలము కడువడి వచ్చెన్
బలు దెసలనుండి పలుత్రో
వల శ్రావణమందుఁ గొండవాఁగులు పోలెన్.

విజయ విహంగంబు విరివిగా రెక్కార్చు
    కొనురీతి జెండాలు కొన్ని యెగిరె
కోటమైసమ్మ తా గుర్రుకొట్టెడు భాతి
    గట్టిగా శంఖసంఘములు మ్రోఁగె

---

* పండిత శంభుచంద్ర విద్యారత్న ప్రణీత మయిన చరితమాల అను గ్రంథము నుండి ఇది కైకొనఁబడినది. నారాయణరావు వధను గురించి మరాటిదేశమునఁ జెప్పుకొను కథను Ballads of the Marathas అను గ్రంథమున ఆక్వర్త్ అనువదించెను.

యుద్ధదేవత లేచి యుహ్వాని యూఁదిన
చందంబుగా దూళి చదలఁ బర్వె
వేరంపు వడ్లంగి పిట్ట కొట్టెడు నట్లు
మధ్యమధ్యములందు మలసె ఢక్క
ఎర్రిగుర్రింబుపైని దా నెక్కి బయలు
దేఱె రఘునాథరావు కుమారులీల
అంతలో నేమి వచ్చెనో యూఁగె భేరి
యూఁగెఁ దప్పెట లాఁగె శంఖారవంబు.

పోవుచుఁ బోవుచున్ జనవిభుండు హఠాత్తుగ నేరి పాదుకా
జ్ఞావశవర్తి యాయె? నల సంయుతిమత్తునఁ బర్వులెత్తుచుం
బోవుచునున్న సైన్యముల మొత్తము లెన్మిదివేల వేరికన్
గేవల యింగితంబునను నిల్చిన వెవ్వరి యింటి ముంగిటన్?

న్యాయాధీశుఁడు రామశాస్త్రి యనువాఁ డగ్రంబునన్ నిల్చి చే
దోయిం బైకిని నెత్తి 'యన్నకొడుకుం దున్మాడియున్ దానికిం
బ్రాయశ్చిత్తము చేసికోక నగరప్రాకారమున్ దాఁటి నీ
వే యూరో రఘునాథరాయ! వడిగా నిట్లేఁగుచున్నావనెన్.'

సమరపుఘోష మెల్లఁ బెలుచం బలుచంబడె వీరమోద నా
దములును నాఁగె ఱేఁ డనియె 'దారిని నడ్డకుఁడయ్య నేనిటుల్
గమన మొనర్తు న య్యవనులం బొరిమాల్చుచు నూఁచముట్టుగా
యమసభ వారి కాఋరుచులార మిఠాయినిఁ బంచిపెట్టఁగన్. ౬

అంతట రామశాస్త్రి యనె నన్నకుమారునిఁ బాపచింతచే
నంతము చేసి తెంతవఱకద్ది విచారణ కాదో యంత వ
ట్టింతయు నస్వతంత్రుఁడ వహీన మమోఘము న్యాయశాస్త్రసి
ద్ధాంతము దాన బందివి కదా రఘునాథ నృపాలచంద్రమా!

ఆ రఘునాథరావనియె హాసము సేయుచు భూమిపాలుఁ డె
వ్వారలబంధనంబునకు బద్ధుఁడు కాఁ డిటు విచ్చుకత్తితోఁ
బోరితముం బొనర్పఁగను బోవుచునుంటినిగాని దారిలోఁ
బాఱుఁడ! న్యాయసూత్రముల భాష్యములన్ వినరానుజూడుమా!

నాఁగను రామశాస్త్రి రఘునాథుఁడ! పోరితముం బొనర్పఁగాఁ
నేఁగుమ దండమున్ విడిచి యేనును నేఁగుదుఁ, జాలుఁ జాలు దు
ర్యోగము! మీర తేర్పఱచియున్న విచారణశాల యన్న క్రీ
డాగృహమందు నిట్టులకటా వినిబద్ధుఁడఁ గాన టంచనన్.

మ్రోఁగెఁ బ్రయాణభేరి మఱిమ్రోఁగెను శంఖము తెల్లసేనలున్
వాఁగులువోలెఁ బాఱె నిఁకఁ బాఱుఁడునుం దనకున్న సంపదల్
త్యాగము చేసి గౌరవపదంబును గూసమువోలె వీడి తా
నేఁగెను సొంతపల్లియకు నెప్పటి జీర్ణ కుటీర భూమికిన్. ౧౦

# ప్రతిజ్ఞాపాలనము

## ౧

వ్రాలుచుండెరా మరాటిమ్రుచ్చులదండు
వీఁక మీరు జాగరూకు లగుఁడు
అంచు దుర్గపాలుఁ డజమీర దుమరాజు
హెచ్చరించెఁ బెద్దయెలుఁగుతోడ.

అందఱ కన్న వేళ యది యప్పుడు దుర్గపు డిండిమంబు పెఁ
గ్రిం దొనరింపఁగా జనము క్రిన్నన దుర్గపుగోడ నెక్కి చూ
డం దొడఁగెఁ మరాటులల డాఁపలిదిక్కున నుక్కుమీఱి మ్రు
ముందరి మన్నుమిన్నులను ముట్టఁగ వచ్చుచునుండి రుగ్రులై.

గండుమరాటుల మిడుతల
దం డిది పెనుకత్తిమంట దగ్ధంబయి పో
కుండినచో నా! యని ప్రతి
తుం డగు నల దుర్గరాజు దుమరా జనియెఁ. 5

దూత యొక్కండప్డు తోతెంచి చెప్పె 'నో
        దుమరాజ! యీసారి దురము వద్దు
ఈ జేని చీటిని వీక్షింపుమా యని
        యీయఁగా, దుమరా జదిటులు చదివె
బుడతకీచుల పెద్దపడవాలతోఁ జాల
        సేసలతోడ విచ్చేసె 'సిందె'
ఆదరంబుగ వారి కర్పించునది దుర్గ
        మఖిలంబు, నీ కిదే యంతిమాజ్ఞ
విజయసింహున కక్కటా విజయలక్ష్మి
వింతగాఁ జూచుచుండంగ విముఖమాయె
ఆజి సుంతయు లేకుండ నాజమీరు
దుర్గ మిపుడు మరాటిచేతులకు నిమ్మ్మ.

దుమరాజు దీర్ఘనిశ్వా
సముతో ననె 'వీరధర్మచరితమునకు భూ
రమణుని పాలకుమునకును నీ
సమరములో సమర మిపుడు సందర్భించెన్' గీ

౨

అంత నా దూత లేచి పోరాడవల ద
టంచు నెల్లెడ డప్పు గొట్టించె మిగుల
దుర్గపాలుండు దుమరాజు దుఃఖ మెదను
బోదల నిలఁబడెఁ బాషాణమూర్తివోలె.

వేళ గడఁచెను వడఁకెను బీరభూమి
ఆలమందలు దవ్వులయందు మసలె
గొల్లపిల్లల పిల్లనఁ గ్రోవిపాట
దట్టమగు చెట్లనీడల దద్దరిల్లె.

‘ఈ యజమీరు దుర్గమును నేలిగ యే యెడ నప్పగించెనో
యాయెడ నాదు దేహమునఁ బ్రాణము లుండ పరాత్యధీనముఁ
జేయను గోట' యంచు నెదఁ జేసితి దొడ్డప్రతిజ్ఞ, ‘దీని భూ
నాయకు నానచే విడువనా?' యనుచుఁ దుమరాజు గోఁజిలెఁ.

౩

రాజపుత్రసేన రగులు రోసంబుతో
సిగ్గుతోడ సమరచేష్ట యుడిగె
దుర్గపాలకుండు దుమరాజు తోరణం
బందు నిలిచె మాట లాడకుండ.

కావిరంగుచేలఁ గట్టి సంధ్యాదేవి
పశ్చిమాంతమునకు వంగివచ్చె
మన్ను మిన్ను జేర్చి మఱి మరాటులదండు
కడకు నాఁగెఁ గోటగవఁకు ముందు.

'ద్వారంబందులఁ బోవుచుండితిరి నిద్రన్ మీర లెవ్వారయా?
మీ రెవ్వారలు లెండులెండు వడిగా మొద్దుండు ద్వారంబు' నా
నేరుం బల్కి రటన్ శయాళు వపు డొక్కింతేని ప్రత్యుత్తర
ప్రారంభం బది లేక దీర్ఘ మగు నిద్రావస్థ జెందెన్ ద్రుటిన్.

వీరధర్మమునకు విభుని యానతికిని
బోరుచిచ్చు నార్పుపొంటె నార
దుర్గసీమముందు దమరాజు ప్రాణార్ప
ణంబు చేసెఁ బెఱవిధంబు లేక. ౧౨

| పుట | పద్యము | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౨౦ | ౧౯ | చినుఁగుపాత | చినుఁగు పాఁత |
| ౨౫ | ౩ | రటుణ్ | రట్టుణ్ |
| ౨౯ | ౧౬ | తెఱపి | తఱపి |
| ౩౧ | ౪ | దోచిరి | దోఁచిరి |
| ౩౧ | ౮ | భటాలికి | భటావళి |
| ౩౮ | ౩౪ | చీకటుల్ | చీఁకటుల్ |
| ౪౩ | ౬౫ | చీకటుల | చీఁకటుల |
| ౪౫ | ౪ | తూడు | తూఁడు |
|  |  | నురుగు | నురుఁగు |
|  | ౫ | ఒనర్పుడు | ఒనర్పుఁడు |
| ౫౫ | ౨ | కబిరు | కబీరు |
| ౬౨ | ౭ | ఏగ ' | ఏఁగ * |
| ౮౧ | ౧౮ | దాపలి | దాఁపలి |
| ౮౪ | ౧౧ | జేఁగురించిన | జేగుఱించిన |

